## నూతన సంవత్సరం

# ఎలా వుండాలనుకొంటున్నారు?

1979 వ సంవత్సరం పేలవంగా యాంత్రికంగానే వుంటుందని మీరు భావిస్తుంటే మేము చెప్ప కలిగేది ఏమీ లేదు.






అలాకాక నూతనసంవత్సరం ఊహించివిధంగాని మార్పును కొనితెచ్చేలా అద్భుతంగా ఉత్తేజ పూరితంగా వుండాలని మీరు ఆలోచుతుంటే మాత్రం ఆ బాధ్యతను మాకు అప్పజెప్పండి!

అసాధారణ మాసపత్రిక 'రేపు' ఇప్పటికే వేలాదిమంది జీవితాల్ని ఉన్నతంగా తీర్చిదిద్దింది. ఒక్క సంవత్సరంలో మీకు నూతనజీవితాన్నివాగ్దానం చేస్తోంది.




## జీవితాన్ని అద్భుతంగా తీర్చిదిద్దే
## ఆధునిక మాసపత్రిక రేపు




ఏలూరు రోడ్
విజయవాడ-520 002.

నూతన సంవత్సరాన్ని 24333

# ఉజ్జ్వలమైన రీతిలో ప్రారంభించండి!



'రేపు' మాసపత్రిక చందాదారులుగా చేరడం జీవితాన్ని ఉన్నతంగా రూపొందించే కీలక ఘట్టం! మీరు చందాదారులుగా చేరితే ఈ ప్రత్యేక సందర్భానికి సంకేతంగా ఉజ్వల భవితవ్యానికి నిరంతరం త్రోవచూపే ఈ డైరీ మీకు కేవలం ఉచితంగా లభిస్తుంది.

ఉచితం




## ఈ సుందరమైన నూతన సంవత్సర కానుకను స్వీకరించండి!

* ప్రక్కనున్న కార్డుపై సంతకంచేసి మీ చిరునామా స్పష్టంగా వ్రాయండి
* ఈ కార్డును వెంటనే పోస్టుచేయండి మీరు స్టాంపులు అంటించనవసరం లేదు.
* ఈ కార్డు మాకు చేరగానే మిమ్మల్ని చందాదారులుగా నమోదుచేస్తూ దాదాపు పది రూపాయలు విలువచేసే ఈడైరీని ఉచితంగా, వి. పి. పి. ద్వారా పంపిస్తాము.
* వి. పి. పి. తెచ్చిన పోస్టుమాన్‌కు రేపు చందా నిమిత్తం రు. 25/- చెల్లించి ఈ డైరీని ఉచితంగా స్వీకరించండి
* మీకు 'రేపు' మాసపత్రికను ప్రతినెలా మొదటి వారంలో చేరేలా సంవత్సరంపాటు పంపిస్తాము.

## ఇదొక అపురూపమైన అవకాశం!




ఏలూరు రోడ్
విజయవాడ 520002

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 15-12-'78

కాళయుక్తినామ సం. మార్గశిర బ. పాడ్యమి

*సంపుటము 72 : సంచిక 14*

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రూ. 41-60
ఆరు మాసాల చందా రూ. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
"నటి శైలజ"
(ఫొటో : కన్నెగంటి మధు)

పక్కింటి పార్వతి బోలెడు
ఖర్చుపెట్టి ఇంటికి ఎమల్షన్
పెయింటు వేయించింది.
కాని నేను ఖర్చులో
20% పైగా ఆదా చేశాను.




"పార్వతి నన్ను అడిగుంటే ఆమె కూడా ఆదా చేసేది. మా ఇళ్లు 120 చ. మీ. వైశాల్యంతో ఒకేలా ఉంటాయి. అందంగా కన్పిస్తుందని, ఇంటికి ఎమల్షన్ పెయింటే వేయిద్దామని ఇద్దరమూ అనుకున్నాం. వేయించాం కూడాను. కాని, ఆమెకు బోలెడు ఖర్చయింది. నాకు మాత్రం 20% పైగా ఆదా అయింది. ఎలా అంటారా, అది సూపర్ డెకోప్లాస్ట్ మహత్యం!"

ఏషియన్ పెయింట్స్

సూపర్
డెకోప్లాస్ట్

CASAP-38-244 TEL

— లోకం పోకడ * ఊమెన్ —













## ముఖచిత్రం

చిరంజీవి చిన్నారి బాబు చిలిపి చూపుల వెక్కిరింతతో 17-11-78 ఆంధ్రపత్రిక ముఖచిత్రం సర్వజన రంజకంగావుంది. తరచూ ఇటువంటి కలర్ ఫొటోగ్రాఫ్‌లను ప్రచురించి మమ్ములను సినిమా ముఖచిత్రాల బోరునుంచి కొంతయినా తప్పించగలరని ఆశిస్తాము. కె. సత్యనారాయణప్రసాద్‌గారికి, ప్రచురించిన సంపాదక వర్గానికి నా హార్దికాభినందనలు.

టి. వి. యస్. మూర్తి [తెనాలి]

* * *

17-11-78వ తేదీ ఆంధ్రపత్రిక "చిన్నారి చిలిపి చూపులు" ముఖచిత్రం మా హృదయాలను ఆకర్షించింది. కేవలం సినీమా నటుల చిత్రాలనే కాక, అప్పుడప్పుడు యిలాంటి చిత్రాలను ముఖచిత్రాలుగా వేస్తారని మా మనవి. కథలన్నీ చాలా బాగున్నాయి. కానీ "నీరజ పెళ్ళి" కథ నేటి సమాజానికి అతి దగ్గరగావుంది. పాత సంప్రదాయాలు మారడం ఎంతైనా అవసరం.

అరవపల్లి లక్ష్మీరాజ్యము మంత్రి లక్ష్మయ్య. వెంకన్న [కమాన్‌పూర్.]

## సినిమా

యన్ టి ఆర్. జయసుధల కాంబినేషన్‌తో 10-11-78న వెలువడిన పత్రిక ముఖచిత్రం ముచ్చటగొల్పుతుంది. రాగద్వేషాలు మంచి సస్పెన్స్‌తో నడుస్తుంది. రచయిత్రికి ధన్యవాదాలు. కవనశర్మగారి సీరియల్ ముందు ముందు ఏం చెప్పబోతారో అనే ఉత్సాహాన్ని కల్గిస్తుంది. సినీన్యూస్ ఎక్కువ కావాలనుకునే వారికి ఈ వారం న్యూస్ మంచి కాలక్షేపం. కార్టూన్‌లు ఆశించినంతగా లేవు.

విజయభాస్కర్. [న్యూఢిల్లీ.]

## టెస్ట్‌ట్యూబ్ బేబి

17-11-78వ తేదీతో వెలువడిన పత్రికలో శీర్షికలన్నీ చాలా బాగున్నాయి. కథలు ఫరవా లేదు. ముఖ్యంగా "టెస్ట్‌ట్యూబ్ బేబి"ని గూర్చి అందించిన వివరాలు చాలా బాగున్నాయి. దీనిని బట్టి మనం అర్థం చేసుకోవలసినదేమిటంటే, "మన భారతీయ 'డాక్టర్లు' కూడా. విదేశీ పరిజ్ఞానానికి దీటుగా నిలుస్తున్నారు." అని శాస్త్రవిజ్ఞానం అభివృద్ధి చెందడంలో. మనము. ఏమాత్రం వెనుకబడి లేమని తెలియవస్తోంది. మీకు చాలా థాంక్స్.

పెన్మెత్స సూరిబాబు, జంపన రవివర్మ, శ్రీను. కృష్ణ, పి.యస్. రాజు. రాజాజీ, బి.మాధవ, [హైదరాబాద్]

# హైదరాబాద్ నోట్‌బుక్

**నవంబర్ రెండవవారం :—**

నవంబర్ రెండవవారంలో జరిగినసంఘటనలు భయమేస్తుంది; సంతోషం కలుగుతుంది; ఆశ్చర్యమూ కలుగుతుంది. ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థులు కొందరు తమ గురువుల పై చేయి చేసుకోడం భయాశ్చర్యాలు కలిగిస్తుంది. శిష్యాదిచ్ఛేత్పరాజయం—అన్నారు పెద్దలు. ఈ విధంగా తమ గురువులను పరాజితులను చేసిన ఉస్మానియా విశ్వవిద్యాలయంవిద్యార్థులను అభినందించవద్దూ మరి! డబ్బున్నవాడికి పై చదువు, అలాటిచదువున్న వాడికే ఉద్యోగం అనే విషమచక్రం తిరుగుతున్నంతవరకు ఇలాటివి జరుగుతూనే వుంటాయి; జ్ఞానానికి చదువు అనే పరిజ్ఞానం మళ్ళీరావడానికి చాలకాలం పడుతుంది. జీవిక ఏదైనా చేసుకోవచ్చు. చదువు మనో వికాసం కోసం, మానవత్వంకోసం, పుణ్య పరిపాకం కోసం—అనే కనువిప్పు కలుగడం సామాన్యం కాదు. అంతవరకు, బెదిరించి మార్కులు వేయించుకోడం, ఉపాధ్యాయులు ఏదో ప్రలోభాలవల్ల విద్యార్థుల చెప్పుచేతలలో వుండిపోవడం, ఆ మార్కులవారికి పదవులు రావడం, వారు అంతర్జాతీయస్థాయిలో మనదేశ గౌరవాన్ని కళంకితంచేయడం ఇదొక భయంకర శృంఖల.

ఆనందించవలసింది దాదాపు అర్థశతాబ్దిగా ప్రజాసేవచేస్తూ జీవితాన్ని ధన్యంచేసుకొన్న శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్‌కు ప్రపంచవిజ్ఞాన సమితి (యునెస్కో) ఈ సంవత్సరం అవార్డును అరుదశాబ్దాలుగా ప్రజాసేవకుడైన ప్రధాని శ్రీ మురార్జీ దేశాయి అందజేయడం. మురార్జీ ఈ అవార్డును నవంబర్ 13న ఆంధ్రమహిళాసభలో జరిగిన సమావేశంలో అందజేశారు.

మరొక ఆనందకరమైన సంగతి సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ బి.ఎ. రెడ్డి కుమార్తె కుమారి సుధారెడ్డికి చిత్రలేఖనం పోటీలో నెహ్రూ అవార్డురావడం. ఆ పాపచిత్ర మొకటి తంతి తపాలావారి మొదటిరోజు పిపాపాపై ముద్రించడమూను. సుధారెడ్డి ఇంతకుముందు ఎన్నో అంతర్జాతీయ బహుమతులు అందుకొన్నది.

వేరొక హర్షవిషయం మాడపాటి హనుమంతరావు బాలికోన్నతపాఠశాల స్వర్ణోత్సవాలు నవంబరు 11 నుండి 13 వరకు మూడురోజుల పాటు వైభవోపేతంగా జరుగడం. దీనిలో ముఖ్య విషయాలు విద్యార్థులు తయారుచేసిన వస్తువుల ప్రదర్శనం, పాత విద్యార్థినులను, పాత ఉపాధ్యాయినులను సత్కరించడం, బాలకవయిత్రుల సమ్మేళనం, విద్యావిషయాలపైన, సంఘంలో మహిళల స్థానంపైన సదస్సులు మున్నగునవి జరుగడం. ఈ ప్రదర్శనానికి తమ రచనలతో, వివరణలతో వన్నెతెచ్చిన విద్యార్థినులు ఇందు, మాధవి, ఉమాదేవి, కె.వి. కృష్ణవేణి, కొరిడె నిర్మల, అపర్ణ, నందిగామ సంధ్య మున్నగు పాపలను అభినందిస్తున్నాను. బాల కవయిత్రులలో సి. రుక్మిణి 'మానవత్వం', కె. వి. ఆర్. లక్ష్మి 'ఎక్కడున్నాడు దేవుడు' శ్రోతలను విశేషంగా ఆకర్షించాయి. ఈ సమ్మేళనానికి శ్రీ రజనీ కాంతరావు అధ్యక్షతవహించగా, శ్రీ న్యాయపతి రాఘవరావు ముఖ్య అతిథిగావున్నారు. రాష్ట్ర ఆబ్కారీ మంత్రి శ్రీ పి. గంగారెడ్డి స్వర్ణోత్సవ ప్రారంభ సభకు అధ్యక్షత వహించారు; రాష్ట్ర మాజీ ప్రధాన న్యాయమూర్తి, మాజీ మంత్రి శ్రీ గోపాలరావు ఎక్‌బోటే ప్రారంభోత్సవం చేశారు. స్వర్ణోత్సవాలను వైభవోపేతంగా నిర్వహించినందుకు ప్రధానోపాధ్యాయిని శ్రీమతి కస్తూరీప్రసాద్‌ను, నిర్వాహకవర్గాన్ని అభినందిస్తున్నాను. కాని, ఒక్కటిమాత్రం కొంచెం కష్టం కలిగించింది. ప్రస్తుతం ప్రముఖులైన పలువురు పాత విద్యార్థినులను సన్మానించారు; చాల బాగుంది. అయినప్పుడు, మాతృభాష తమిళయినా, తెలుగునేర్చుకొని ప్రతితరగతిలోను, అన్నిటా ప్రథమశ్రేణిలో వుంటూ నేడుఆచార్య అయి, ఉస్మానియా విశ్వవిద్యాలయం మహిళా కళాశాలకు ప్రిన్సిపాలుగావున్న పాతవిద్యార్థిని ప్రొఫెసర్ వసడా అయ్యంగారును, ప్రాకృత సాహిత్యంలో దక్షిణాపథంలోనే తొలిసారిగా డాక్టరేట్ పట్ట సంపాదించిన పాతవిద్యార్థిని డాక్టర్ కొరిడె కమలను అలాంటిమరికొందరిని సన్మానించి వుంటే బాగుండేది.

**"దేశం ముక్కలయ్యేదికాదు"**

ప్రధాని మురార్జీ దేశాయి నవంబరు 13వ తేదీ సాయంకాలం ఎగ్జిబిషన్ గ్రౌండులో మౌలానా మహమ్మదాలీ శతజయంతి సందర్భంగా జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ, ఆలీసోదరులు—మౌలానా మహమ్మదాలీ, ఆయన జ్యేష్ఠసోదరుడు మౌలానా షేక్‌తాలీ జీవించివుంటే, భారతదేశ విభజన జరిగేది కాదని, ఉద్ఘాటించారు. ఆలీ సోదరులు హిందూ ముస్లిం సమైక్యానికి చేసిన అపార కృషిని ఆయన వివరించి, స్వతంత్ర మయ్యే వరకు భారతదేశంలో అడుగుపెట్టనని, మహమ్మదలీ లండనులో వేమరణించారని, ఆయన అభిప్రాయభేదాలవల్ల కాంగ్రెస్‌నుంచివిడిపోయినా ఎప్పుడు ప్రత్యర్థులను తూలనాడని ఉదాత్తుడని ఆయన ప్రశంసించారు. మహమ్మదాలీ కాకినాడ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించడంవల్ల తెలుగు వారికి చాల సన్నిహితులయారు.

ప్రధాని 13వ తేదీ హైదరాబాద్‌కు వచ్చి, తీరిక లేకుండా కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఫతేమైదాన్ బహిరంగ సభలో ప్రసంగిస్తూ జనతా ప్రభుత్వం కృషిని వివరిస్తూ, అసత్య ప్రచారాలకు మోసపోతే ప్రజాస్వామ్యానికి ముప్పన్నారు. బాలబాలికల సమావేశంలో పాల్గొన్నారు. 14వ తేదీ రామగుండంలో థర్మల్ విద్యుత్కేంద్రానికి శంకుస్థాపన జరిపి ఆనాడే ఢిల్లీకి తిరిగి వెళ్ళారు.

**ఉపశ్రుతి :—**

"ఏమిటిసార్, విద్యావిధానంలో మళ్ళీ మార్పు కావాలని అంటున్నారే ఆబ్కారీ మంత్రి మాడపాటి వారి బాలికోన్నతపాఠశాల స్వర్ణోత్సవాలలో?" అనడిగారు ఒక విద్యార్థి తండ్రి ఆందోళనతో. "ఏమి మార్పులు చేసినా, ఉపాధ్యాయులు చెప్పడమూ విద్యార్థులు చదవడమూ మామూలేగా. కంగారెందుకూ?" అన్నారు ఒక రాజకీయ తత్త్వవేత్త.

—తిరుమల రామచంద్ర



సీరియల్

# గవర్నెస్ కరుణ

గంటి వెంకటరమణ

బస్సులో ప్రయాణం కరుణ కళ్ళకి మరీ వచ్చింది. కుడివైపు కొబ్బరి తోటలు, ఎడమ వైపు గంభీరంగా పారే కాలువ కరుణని ఆకట్టుకున్నాయి. బస్సు సరిగ్గా గుమ్మంలో ఆగింది బస్సు ఆగిన శబ్దం విని లోపల్నించి పిల్లలు బిలబిల మంటూ బయటికి వచ్చేశారు.

'అమ్మోయ్ ఎవరో వచ్చారే' పిల్లలు యింట్లోకీ బయటికీ పరిగెత్తుతున్నారు. కరుణ తండ్రి మొహంలోకి చూసింది. అతనూ గట్టిగా కేక పెట్టాడు 'కాళీ' అంటూ.

కాళి బయటికి వచ్చింది. కరుణనీ భార్గవనీ చూపి 'వదిన ఏదన్నయ్యా' అని అడిగింది.

భార్గవ పిల లందరినీ దగ్గరకి తీసుకుని 'నేను మీకు మావయ్యని. సెలవుదొరకలేదు కాళీ అందుకే అది రాలేదు' అన్నాడు.

కాళికి యింటినిండా పిల్లలున్నారు. అయినా తెల్లగా ముద్దుగా గుమ్మడి పండులా వున్న కరుణని దగ్గరకి తీసుకుంది. కరుణకి సిగ్గుగా, భయంగా కొత్తగా వుంది. ముందు పిల్లలందరూ ఒకళ్ళ మొహాలు ఒకళు చూసుకున్నారు. ఆ తరువాత పెద్ద పిల్ల కరుణ దగ్గిరకి వచ్చి ఆ పిల్ల చేయి అందుకుని 'రా...నీ పేరు' అంది చనువుగా.

కరుణ పది పన్నెండు మెట్లెక్కి లోపలికి వెళ్ళింది తండ్రి వెనుక. ఇల్లు పెద్దదే దానిని మండువా లోగిలి అంటారని కరుణకి తెలియదు. కాళి అప్పుడెప్పుడో తండ్రి కాశ్మీరు నుంచి పంపిన చీర కట్టుకుంది. ఒంటిమీద పెద్ద చెప్పుకోతగ్గ ఆభరణాలు లేవు. మెళ్ళో ఒంటి పేట పుస్తెలతాడు, నల్లపూసలు వున్నాయి. మెలివేసిన ముడి వేసుకుంది ఆమె. అతి సామాన్యంగా వున్నా ఆమె మొహంలో

(గత సంచిక తరువాయి)

ఆకర్షణ వుంది. పెద్దపిల్ల తన పేరు చెప్పింది 'దుర్గ' అని. ఆ తరువాత అందరి పేర్లూ వరుసగా చెప్పింది. కరుణ ఒక యింట్లో యింతమంది పిల్లలుండడం యింత వరకూ చూడలేదు.

'త్వరగా పెట్టవే' అంది కాళి.

దుర్గ రెండు నిమిషాల్లో కొబ్బరిమండ తీసుకువచ్చి కొబ్బరాకులు మంటచేసి టీ తయారుచేసి యిచ్చింది.

ఒక గంట గడిచేసరికి ఆ యింటి వాతావరణానికి అలవాటు పడింది. పెరడు చూపించింది కాళి. అక్కడ దేవాంగులు చీరలు నేస్తున్నారు! ఇప్పుడీ చీరలు చాలా ఫేమస్ అయ్యాయి. ఇక్కడ లెట్రిన్స్ వుండవు. సెప్టిక్‌వి కట్టించినా అప్పుడప్పుడు గోదావరి పొంగితే ఆ నీరూ, యీ నీరూ ఏకం అయిపోతుంది.

'బాప్‌రే' కరుణ భయంగా అంది.

'నీకోసం తడికలు కట్టించింది మా అమ్మ. మీ నాన్న మాకు మీరు వస్తున్నట్టు టెలిగ్రాం యిచ్చారు. మీ రెవరో మా తమ్ముళ్ళకీ చెల్లెళ్ళకీ మాత్రమే తెలీదు.'

'మీ నాన్నగారేరీ!'

'ఆయన బస్‌మీద వెళ్ళారు'

'ఎక్కడికి?'

'ఆయన యిన్‌స్పెక్టర్.'

'అలాగా.'

'ఇది పిల్లకాలువ. చాలా బట్టలున్నప్పుడూ, యింటికి చుట్టాలు వచ్చినప్పుడూ యిక్కడ వుతుకుతాం.'

'ఈ సమాధి ఏమిటి?' కరుణ వొడ్డున వున్న సమాధిని చూపిస్తూ అడిగింది.

'ఇది సమాధి కాదు, బహుశాః వీటిలో అస్థిక లున్నాయేమో తెలియదు నాకు. మొత్తానికి యివి మా తాతగారివీ, ఆయన అన్నవీ.'

'దూరంగా ఆ పొగ ఏమిటీ?'

'ఇది కౌశిక. ఇక్కడ స్నానాలు చేస్తారు, స్మశానానికి వెళ్ళినవాళు.'

'అరె' కరుణ నీళ్ళల్లోంచి కాలు టక్కున బయటికి తీసేసింది.

'అయ్యోరామ. అది నీటి పాము. ఏమీ చేయదు. నువ్వు చూస్తూండు' అని దుర్గ చటుక్కున నీళ్ళల్లోకి దిగింది. రెండు క్షణాల వరకూ కనిపించకపోయేసరికి కరుణ బిక్కమొహం వేసింది. దుర్గ తల పైకి ఎత్తింది. నీటిలో ఆమడ దూరంలో తేలుతోంది. అవతలి వొడ్డున సీమచింతచెట్టుని వెదురు కర్రతో కొట్టి కాయలు వోణీలో మూట కట్టుకుని యీదుతూ వచ్చేసింది. కరుణ బుగ్గన చేతులుంచుకుని చూడసాగింది. 'సీమచింతకాయలు యివి తిను' కరుణ చేత బలవంతంగా తినిపించింది.

'మా అమ్మ తిడుతుంది దుర్గా యిటువంటివి తింటే.'

'అదేం!' దుర్గ ఆశ్చర్యంగా చూసింది.

'ఒళ్ళు పాడైపోతుంది అంటుంది. ఆరోగ్యంకాపాడుకునేందుకు డైటింగ్ చేయా లంటుంది.'

దుర్గ పకపకా నవ్వింది: 'భలేదానివి. మనకి ఈ శరీరం –యిచ్చినందుకు చచ్చినట్టు గొడ్డుచాకిరీ చేయాలి. చేసినందుకు తెగ తినాలి. మా వూళ్ళో రాళ్ళూ రప్పలూ కూడా తేలికగా జీర్ణం అయిపోతాయి.'

'నా కంతా వింతగా వుంది దుర్గా.'

'ఇప్పుడే ఏముంది. ఇంకా నాలుగు రోజు లుంటే నువ్వు మా వూరు వదలవు' దుర్గ పొడి బట్టలు వేసుకోసాగింది. కరుణ దెబ్బ తిన్నదానిలా చుట్టూ చూసింది. దూరంగా గేదెలమీద కూర్చున్నారు కొందరు. ఎరకలు పందుల్ని అదిలిస్తున్నారు. చెంబులు తీసుకుని ఆడవాళ్ళు పేరంటానికి వెడుతున్నట్టు వెడుతున్నారు. ఇక్కడ యీ ఒడ్డున దుర్గ తడి లంగామీద పొడి లంగా వేసుకుని క్రింది

---

**జరిగినకథ:** డాక్టర్ భార్గవ, మేనకల ఏకైక పుత్రిక కరుణ, తన తల్లి, మూర్తితో చనువుగా ఉండటాన్ని చూచి సహించలేక పోతుంది.

---

నుంచి మెల్లగా లాగేసింది. సిగ్గుతో చితికిపోయింది కరుణ. కళ్ళు మూసుకుంది. దుర్గ 'పద పోదాం' అంది.

కరుణ స్నానం చేయలేదు. ఆ పూటకి కాలకృత్యాలు కూడా మానేసింది. తండ్రిదగ్గిరకి వెళ్ళి 'ఎలా డాడీ స్నానం చేయడం' అంది.

కాళి పిలిచి కొత్తగా తను మేనకోడలికి కట్టించిన తడకలు రెండూ చూపించింది. కరుణ కొంతలో కొంత తేలికగా నిట్టూర్చింది.

భోజనాల సమయంలో కరుణకి కళ్ళ నీళ్ళ పర్యంతం అయింది. పనసపొట్టుకూర ఆవపెట్టి అన్నగారికి యిష్టం అని అరిటాకులో ఓ పక్కగా వుప్మె అంత వేసింది! ఆ చేత్తోనే కరుణకీ వొడ్డించింది. కరుణ ఆ కారం తినలేక కళ్ళల్లో నీళ్ళతో తండ్రివైపు చూసింది.

'రెండు రోజులు కొంచెం కారం తగ్గించు కాళీ. మాకరుణ అసలు తినలేదు' అన్నాడు అతను. కాళి చాలా సేపు నొచ్చుకుంది.

మధ్యాహ్నం నిద్ర లేవగానే కొబ్బరి బొండాలు, అటుకులూ, ఆవకాయా పెట్టింది. కరుణ పళ్ళు నొప్పి పుట్టడంతో తినలేకపోయింది. కాళి మిగతా పిల్లలు రసగుల్లాలు తిన్నంతగా తింటున్నారు. కరుణ తను తినడం మానేసి వాళ్ళవైపే విచిత్రంగా చూడసాగింది.

ఆ యింట్లో కరెంటు లేదు. హరికెన్ లాంతర్ వెలుగులో పిల్లలకీ, భార్గవకీ, కరుణకీ భోజనాలు ఏర్పాటు చేసింది. ఆ తరువాత ఓ మోపెడు తేగలూ కురిడీ తీసుకువచ్చి యిచ్చింది. కరుణ వాటిని చూస్తూనే 'యింక నేను తినలేనండి' అంది. అలసిపోయి తండ్రి పక్కనే చేరగిల పడింది. అతని ఒళ్ళోనే నిద్ర పోయింది. కరుణకి చాలా రోజుల తరువాత యివాళే మంచి నిద్ర పట్టింది.

తెల్లవారింది. కరుణని పిల్లలందరూ వచ్చి లేపారు. చేతిలో కచ్చిక వేయగానే 'యిదేమిటి?' అని అడిగింది.

'పిడక కాల్చింది' పిల్లలు చెప్పారు. కరుణకి ముందు వెగటు అనిపించినా అందరితోబాటు మొహం కడుక్కుంది. వంట యింట్లో పీటలమీద కూర్చుని ప్రసాద్ భార్గవతో మాట్లాడుతున్నాడు. నలభై ఏళ్ళుంటాయి అతనికి. చీకూచింతా లేని ఆ సంసారం చూస్తుంటే భార్గవకి ఆనందంగానే వుంది.

అరటిపువ్వు వొలుస్తోంది కాళి. దుర్గ దూట చక్రాలు తరుగుతూ మధ్య మధ్య వేలికి పూసలు చుట్టుకుంటోంది. కరుణకి ప్రతి విషయం వివరంగా చెబుతోంది దుర్గ.

ఆ యింట్లో పిల్లల సందడి పెళ్ళివారిల్లుని గుర్తుకు తెప్పిస్తోంది. ఆ రాత్రి కరుణకి నిద్ర పట్టలేదు. ఈ వాతావరణంలో తల్లినీ, జమ్మూనీ పూర్తిగా మరిచిపోయింది. మినీ స్కర్ట్ వేసుకునే ఆ పిల్లని పదేపదే చూస్తుంటారు యిక్కడి పిల్లలు. పంజాబీ డ్రస్ వేసుకున్నా ఆశ్చర్యమే వాళ్ళకి. తల్లి జ్ఞాపకం రాగానే బెంగగా అనిపించింది. తల్లి యిప్పుడు ఏం చేస్తూ వుంటుంది. కరుణ మనసులో చింత వద్దనుకున్నా మూర్తి కనిపిస్తున్నాడు. ఏ రోజుకి ఆ రోజే అనుకుంటోంది. తల్లిని గురించి తండ్రితో చెప్పేయాలని. కానీ నోరు రావడంలేదు. ఈ సంఘర్షణల మధ్య కరుణ నలిగిపోతోంది.

మర్నాడు "కరుణా నీకు జడకుచ్చులు



పెట్టి జడ వేస్తాం రావా' దుర్గ చెల్లెలు భవాని పిలిచింది. కరుణ, వాళ్ళు ఏం చెప్పినా వింటోంది. అసలు కరుణది ఎదిరించే స్వభావమే కాదు. దుర్గ జడ వేసింది. మళ్ళీ మొగ్గలు మాల కట్టి జడ మీద అందంగా పెట్టింది.

వంకీ, వడ్డాణం, పాపిడిబిళ్ళ, నాగరం యివన్నీ మేనత్త వి యిచ్చింది దుర్గకి తన పేరు అని. అవన్నీ పెట్టి తన లంగా ఓణీ కూడా కట్టబెట్టింది. కరుణ వీటిని వేసుకుని అద్దం ముందు నిలుచుంది. కరుణ నీలికళ్ళు అద్దంలో చేప పిల్లల మాదిరి మెరుస్తున్నాయి. అందంగా వుండే కరుణ ఈ డ్రెస్‌లో అచ్చు పల్లెటూరి పిల్లలా వుంది. వెనకనుంచి వచ్చిన భార్గవ అమాంతం కూతుర్ని ఎత్తుకుని బయటికి తీసుకువచ్చి అరటిచెట్టు పక్కన నిలుచో పెట్టాడు. అరటిగెల మీద చేయి వేసి పండును అందుకోబోతున్న కరుణ ఫొటోలు రకరకాల యాంగిల్స్‌లో తీశాడు. కెమెరా చూడగానే పిల్లలందరూ ఎగబడ్డారు. మొత్తం ఫామిలీ ఫొటో ఒకటి తీసి అందర్నీ తీశాడు. ఫొటోలతో సందడితో ఆ రోజు గడిచిపోయింది.

కొత్త బండార్లంక గుడికీ, అమలాపురం సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయానికి తీసుకువెళ్ళాడు ప్రసాద్. పేరూరులో చెల్లెలు వుంటే ప్రసాద్ తన చెల్లెలి యింటిని చూపిస్తానంటూ తీసుకువెళ్ళాడు.

# గవర్నెస్ కరుణ

గుర్రపు బండీమీద కూర్చుని చూస్తుంటే ఆవూరి ''జమీందారుగారి పొలాలు'' పచ్చగా కనులవిందు చేస్తున్నాయి. ఎక్కడ చూసినా ఆకాశాన్ని ముద్దు పెట్టుకునే కొబ్బరిచెట్లు. అరటితోటల మధ్య ప్రకృతి ముద్దు బిడ్డలా వుంది కోనసీమ. కరుణ కళ్ళు ఎందుకో తడిశాయి. తన తల్లి...తన తల్లి కూడా చదువుకుని వుండకపోతే కాళి అత్తయ్యలా యింటినిండా పిల్లలతో ఎంత బాగుండేది. కరుణ మనసు కీడుని శంకిస్తోంది.

ఆ మర్నాడు అక్కడినుంచి కాళి దగ్గరకి వచ్చేయాలని పేచీ పెట్టింది. ప్రసాద్ చెల్లెలికి పిల్లలు లేరు. కరుణకి తోచలేదు. తండ్రిని పోలిన కరుణ పధ్నాలుగేళ్ళకే ఎత్తరిగా ఆరోగ్యంగా వుంది. వచ్చిన పదినిమిషాలకే 'అన్నయ్యా నీకు ఖర్చు తగిలింది' అంటూ వచ్చింది కాళి. భార్గవ అర్థంకాని వాడిలా చూశాడు.

కాళి కొంగు భుజంనిండా కప్పుకుని 'పేరంటం పిలవాలి నువ్వూ మీ బావగారూ వెళ్ళి కర్పూరపు గెల ఒకటి, కుంచెడు సెనగలూ తీసుకురండి. నువ్వులు మరిచి పోకండి' అంది.

'ఎందుకమ్మా' భార్గవకి యింకా అర్థం కాలేదు.

'నీ కూతురు పెద్దదైందన్నయ్యా' కాళి సిగ్గు పడుతూనే ముసి ముసిగా నవ్వుతూ అంది!

భార్గవ ఆశ్చర్యపోయాడు. తరువాత లేచి నిలుచున్నవాడు హాయిగా మంచం మీద వెనక్కు వాలి కూర్చుని 'ఆ పద్ధతులేం వొద్దు కాళీ. అది కూర్చోలేదు యీ మూడు రోజులూ. దానికి భయం కూడా ఒక్కర్తీ పడుకోవడం, చెంబుడు నీళ్ళుపోసి లోపలికి తీసుకువచ్చేయ్' అన్నాడు.

'ఛ! అదేంపని. యిటువంటివి మనం పట్టించుకోకపోతే ఆనక అనేక అనర్థాలు వస్తాయి. నేనుమాత్రం ఒప్పుకోను– నీ కూతురికి భయం లేకుండా దాని పక్కన రాత్రిళ్ళు నేను పడుకుంటానులే' అంది.

భార్గవ పల్లెటూరి వాతావరణానికి తల వంచక తప్పలేదు. మూడు రోజులూ పేరంటాళ్ళు వచ్చి వెడుతూనే వున్నారు. కరుణమీద పడేసిన స్వీట్సు, తినుబండారాలు ముట్టుకోకుండా మిగిలిన పిల్లలు కూడా స్వాహా చేస్తున్నారు. నాలుగో రోజు అట్లబంతి. దుర్గా, కాళీ బియ్యం పోసేసి అట్లు తయారు చేశారు.

నిలువెత్తు అద్దంముందు పూలజడ వేసి కూర్చోబెట్టారు కరుణని. ఫొటోగ్రాఫర్ వచ్చి, ఫొటో తీసుకున్నాడు. కరుణ పెద్దదైందని టెలిగ్రాం యిచ్చాడు భార్గవ భార్యకి. ఆమె ఏ జవాబూ రాయలేదు. దుర్గ ఎన్నోసంగతులు కరుణ చెవిలో చెబుతూంటే ఆశ్చర్యంతో, జుగుప్సతో, భయంతో,

# దగ్గు గప్‌చిప్




గ్లైకోడిన్ అలాంటి, యిలాంటి మామూలు దగ్గు మందుకాదు. భారత దేశంలో దగ్గు చికిత్సకోసం వాడే మందులలో దీనిని ప్రథమ స్థానం.

**గ్లైకోడిన్ అన్ని రకాలైన దగ్గులనుంచీ శమనాన్నిస్తుంది.**

- <u>మెదడులో</u>, దగ్గాలని అనిపించే కోరికను కలగనివ్వదు.
- <u>ఛాతీలో</u>, పట్టుకునేలాంటి అసౌకర్యాన్ని దూరంచేసి విశ్రాంతినిస్తుంది.
- <u>గొంతులో</u>, గరగరలాడటంనుంచి ఉపశమనం యిస్తుంది.
- <u>ఊపిరితిత్తుల్లోని</u>, కఫాన్ని బయటకు తెచ్చేస్తుంది.

**బాధపెట్టి, అసౌకర్యపరిచే అన్ని రకాల దగ్గులనుంచి శమనానికి గ్లైకోడిన్‌ని విశ్వసించండి**

*Alembic*

అలెంబిక్—డాక్టర్లకు వీరి మందులపై విశ్వాసం ఉంది.

# గ్లైకోడిన్ దగ్గుల్ని తగ్గించడంలో భారతదేశంలో ముందడుగు.

everest/78/ACW/236-tl

# గవర్నెస్ కరుణ

వెచ్చని శరీరంలో జరిగే మార్పుతో కరుణకి బెంగ పట్టుకుంది. దుర్గ మహా అయితే మరోఏడాది, రెండేళ్ళు పెద్దదై వుంటుంది కరుణ కన్నా. ఫిఫ్త్‌ఫారమ్ చదువుతోంది. పల్లెటూరి పిల్లల్లో వుండే ముదినాపసాని కబుర్లు చెవుల్లోకి అందించేది. అందరూ వున్నప్పుడు మిగిలిన పిల్లలందరి కన్నా కొంచెం నయంగా గంభీరంగా వుండేది. కరుణ అన్ని సంగతులూ మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం తెచ్చుకుంటే భయపడిపోయి తల్లి సంగతి చెప్పేయాలనుకునేది. అంతలోనే నిగ్రహంగా వూరుకునేది.

పదిరోజులు పదినిమిషాల మాదిరి గడిచి పోయాయి. భార్గవ 'వెళ్ళిపోదాం' అన్నాడు. కరుణకి వుండాలనే వుంది. కానీ సెలవులు అయిపోతున్నాయి. పిల్లలకి పంచమని చెల్లెలి చేతిలో నాలుగు పచ్చనోట్లు పెట్టాడు. కాళి మేనకోడల్ని ముద్దు పెట్టుకుని 'మా రవికి చేసుకుంటా వన్నయ్యా' అంది.

భార్గవ నవ్వి వూరుకున్నాడు.

కాళి పెద్దకొడుకు బి. యి. చదువు తున్నాడు విశాఖపట్టణంలో. ఆ పిల్లడు చాలా తెలివైనవాడు. అతని చదువులకయే ఖర్చు భార్గవే భరిస్తున్నాడు.

''నువ్వు వూఁ అనడం లేదేం' కాళి గొంతులో నిష్ఠూరం వినిపించింది.

'రాత ఎలా వుంటుందో. ఇప్పటినుంచీ అనుకోవడం దేనికి' భార్గవ తెలివిగా తప్పించుకున్నాడు.

కరుణకి పట్టు పరికిణీ, జార్జెట్ వోణీ కొంది కాళి.

తన కూతురు డైనింగ్ టేబిల్ తిండీ, బ్రేక్‌ఫాస్ట్‌గా ఆమ్లెట్ తిని అతి నాజూకుగా ఏడు మల్లెపువ్వుల ఎత్తులో పెరిగింది. అటువంటి పిల్ల యిక్కడ తేగలు తింటూ ఈ కారాలు తింటూ యీజీగా పది కొబ్బరి కాయలు కొట్టి పచ్చడి చేస్తూ బ్రతకాల్సి వొస్తుందని ఆ తండ్రి ప్రాణం కటకట లాడింది. అతను చెల్లెలికిమాట యివ్వలేదు. ఆ టాపిక్ తిరిగి దొర్లకుండా హడావుడిగా కాలక్షేపం చేసేశాడు.

బస్సు అమలాపురంలో ఎక్కారు. ప్రసాద్ మితభాషి. అతను ఆ పిల్ల చేతిలో మిఠాయి కొమ్ములూ, పూతరేకులూ పెట్టి ఇరవై రూపాయల నోటు యిచ్చాడు. బస్సు బయలు దేరింది. బండార్లంక రాగానే అందరూ వాకిట్లో నిలుచుని 'కరుణా, కరుణా' అంటూ కేకలు పెట్టారు. కరుణ బస్సు కనుమరుగైపోయే వరకూ చూస్తూనే వుంది. అనుకున్నంత నిశితంగా పల్లెటూర్లన్నీ చుట్టబెట్టేందుకు టైము లేక పోయింది. కరుణ సెలవులు అయిపోయాయి. ఇల్లు చేరుకోవాలి అంటే కరుణకి బెంగగానే వుంది.

* * *

పిడుగు ఎక్కడో పడితే, అగ్ని పర్వతం బ్రద్దలైతే వింతగా కథలు చెప్పుకుంటాం. కానీ ఆ పర్వతం మనకి చేరువలో బ్రద్దలైతే పిడుగు పడితే సమూలంగా నాశనం అయిన మన పరివార జనాన్ని చూడాల్సి వచ్చినప్పుడు ఏకాకితనం చుట్టబెట్టుకుని కటిక చీకట్లోకీ నరకంలాంటి తపనలోకీ చుట్టేస్తుంది. సరిగ్గా యిలాంటిదే భార్గవకీ కరుణకీ జరిగింది. ఇల్లు చేరుకునేసరికి 'గుడ్డీ' అని కౌగలించుకుని కరుణ తలని గుండెల్లోకి చేర్చుకుని బావురు మంది దర్శన్.

భార్గవ రెండు మూడు సార్లు అడిగే సరికి దర్శన్ ఏడుపుని దిగమింగి 'మేనక లేచి పోయింద'ని చెప్పింది.

భార్గవ కుప్పలా కూలిపోయాడు. కరుణ తండ్రి గుండెల్ని అనుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది– దర్శన్ ఫోన్ చేయగా సింగ్ వచ్చి పరీక్ష చేశాడు. భార్గవ ఈ అఘాతాన్ని భరించలేక పోయాడు. అతనికి దుఃఖం రావడంలేదు. మెదడు శూన్యంగా అనిపించ సాగింది. దర్శన్ వివరంగా చెప్పింది. సింగ్ మందులు రాసియిచ్చాడు. యింజక్షన్ యిచ్చాడు – భార్గవకి 'సారీ' చెప్పి వెళ్ళిపోయాడు డాకర్ సింగ్ అతను వచ్చాడన్న వార్త తెలియగానే తెలిసిన వాళ్ళందరూ వచ్చి పరామర్శలు చేసి వెళ్ళిపోయారు. భార్గవ కూతుర్ని కౌగలించుకుని అప్పుడు కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

మేనక రాసిన వుత్తరం యిచ్చింది దర్శన్.

డియర్ భార్గవ,

నేను ప్రేమించిన మూర్తితో వెళ్ళిపోతున్నాను. ఇలా రాయవలసి వచ్చినందుకు నన్ను క్షమించు.

— మేనక.

అతను ఆ వుత్తరాన్ని లక్షసార్లు చదువుకున్నాడు. అందులో ఏ అక్షరం కూడా కరుణకి లేదు. అసలాపిల్ల వున్నసంగతే మేనక మర్చిపోయిందా అనిపిస్తోంది అతనికి. ఇంత జరిగాక ఆవేళ తను చూసిన సంగతి చెప్పడం అనవసరం అనుకుంది కరుణ.

''మీరు వెళ్ళిన రెండు రోజులకే వెళ్ళిపోయారు' దర్శన్ చెప్పింది. భార్గవ ఆ రాత్రి భోజనం చేయలేదు. కరుణా తినలేదు. భార్గవ పీకలదాకా తాగేసి నిద్రపోతే కరుణ నిద్ర రాక, నిద్రపోయేందుకు



# గవర్నెస్ కరుణ

మార్గంలేక అలాగే మంచంమీద కూర్చుండి పోయింది.

మర్నాడు ప్రొద్దున్న ఒకరి తరువాత ఒకరుగా యింటికి వస్తున్నారు. పలకరిస్తున్నారు. ఏడుతున్నారు. అందరి మొహాల్లోకీ చూసీ, అందరికీ చెప్పి చెప్పి విసిగిపోయింది కరుణ. వెళ్ళినతల్లిగుండెరాయి చేసుకుంటే మిగిలిన కరుణకి ఆ గుండె ఏదో నీరై ఆ నీళ్లుకళ్లల్లోంచిబయటికి కాలువలు కడుతున్నాయి. దర్శన్ ఈ నెల్లాళ్ళల్లో చాలా చిక్కిపోయింది. ఆరునెల్ల పాపాయికి కాళ్ల మీద పడుకోబెట్టుకుని నీళ్లు పోసింది. ఆ కరుణే తప్పటడుగులేస్తూ వస్తూంటే పరుగున వెళ్ళి పట్టుకునేది. దర్శన్ పేరు రాక 'దానీ' అంటూంటే పకపకా నవ్వుకునేది. ఆ యింటిలో విడదీయలేనిబంధాన్ని ఏర్పరచుకున్న దర్శన్‌కి మేనకమీద పీకల దాకా కోపం వస్తోంది. అయినా నిగ్రహించుకునేది. తల్లి చేయవలసిన కనీస బాధ్యతల్ని ఆమె ఏన్నడూ చేయలేదు. ఫాషన్ పేరుతో చంటిపిల్లకి పాలు యివ్వకుండా ఫీడర్ అలవాటు చేసినప్పుడు దర్శన్‌కే కళ్ళనీళ్ళు వచ్చాయి. బయట కారులో స్నేహితులు హారన్‌లు కొట్టి పిలుస్తూంటే పిల్లని దర్శన్‌కి అందించి భార్గవ చేతిని అందుకుని పరిగెత్తేది. మేనక ఏవిటో ఆమె జీవితం ఏవిటో? దర్శన్ ఒక్కనాడూ ఆలోచించకుండా వదుకోలేదు. పరువంలో వున్నది కనుక వయసు పొంగు అనుకునేది. ఏన్ని ఏళ్ళు వచ్చినా మేనకలో ఆ వుత్సాహమూ తగ్గలేదు, చివరికి కూతుర్ని సైతం లెక్క చేయకుండా వెళ్ళిపోయేందుకు తోడ్పడింది.

'అన్నం తిందువుగాని రా తల్లీ' దర్శన్ తలుపు దగ్గరకి వచ్చి పిలిచింది.

కరుణ తల ఎత్తి ఆమె వెనకే వెళ్ళింది. తను భోజనానికి కూర్చునే ముందు తండ్రి గదిలోకి వచ్చింది. అతను పీకలదాకా తాగేసి కటిక నేలమీద పడుకున్నాడు. అతనిబట్టలు మాసిపోయి వున్నాయి. అటాచ్‌డ్ బాత్ రూమ్‌లో అతను ఏప్పుడు కాలకృత్యాలు తీర్చుకుంటున్నాడో ఏమోగానీ మాసిన అతని పైజామా లాల్చీ చూసేందుకు జుగుప్సాకరంగా వున్నాయి.

'డాడీ'కరుణ పిలుపు అతనికి అందలేదు. తండ్రిని చేతో తట్టి లేపింది. అతనికి చాలా సేపటి వరకూ తెలివి రాలేదు. అతి ప్రయత్నంమీద కళ్ళు తెరిచాడు. 'భోజనం చేయలేదు మీరు.'లేవండి భోజనానికి'ఆయన ఆ పిల్ల మొహంలోకి చూసి బావురుమన్నాడు. కడుపు వెన్నుకు అతుక్కుపోయి వుంది. కళ్ళు చాలా లోతుకు పోయాయి. రెండు మూడు రోజులకే వార్ధక్యం మీద పడ్డట్లుగా తయారయ్యాడు భార్గవ. కరుణ అతని వైపు జాలిగా చూపింది.

'మీరు భోజనానికి రండి డాడీ.'

'నాకు ఆకలి లేదు.'

'నేను తినద్దా చెప్పండి.'

'నువ్వు తినేయ్ తల్లీ.'

'మీరు లేకుండా ఎలా తినను డాడీ!'

ఈ మాట విని అతను లేని వోపిక తెచ్చుకుని దిగ్గున లేచి కూర్చున్నాడు. నిలుచున్న కరుణ చేతిని ఆసరాగా చేసుకుని లేచి నిలుచున్నాడు 'నేను స్నానం చేయలేను తల్లీ.'

'పోన్లెండి' కరుణ అతని చేతిని మెడ మీద నుంచి చుట్టి గట్టిగా పట్టుకుంది. కూతురి వెనకే డైనింగ్ టేబిల్ దగ్గరకి వచ్చి కూర్చున్నాడు. అతను ఏం తింటున్నాడో అతనికే తెలియదు. అన్నీ కలగాపులగం చేసి ముద్దలు కలుపుతున్నాడు. చేయి వాటిని అందిస్తూంటే నోరు అందుకుంటోంది. మింగుడుపడే ఆ ముద్దలకి సహాయంగా నీళ్లగ్లాసులు ఒకదాని వెనుక ఒకటి పరిగెత్తుతున్నాయి. ఈ పరిస్థితి చూస్తే కరుణకి దుఃఖం వచ్చింది. తను ఏడుస్తే తండ్రి మరీ బేలగా అయిపోతాడు. కరుణ నిగ్రహంగా వూరుకుంది. అతను భోజనం చేశాననిపించుకుని తన గదిలోకి వెళ్లిపోయాడు. బీరువా తెరిచిన చప్పుడు అయింది. అంటే తిరిగి బాటిల్‌ని అందుకుంటున్నాడన్నమాట. కరుణ దీర్ఘంగా నిట్టూర్చింది. సాయంత్రం కాగానే తండ్రి గదిలోకి వచ్చి అతని తలకి కొబ్బరినూనెరాసింది క్రాపు దువ్వింది. బట్టలు చేతికి అందించింది. మొహం కడుక్కునేందుకు వాష్ బేసిన్ దగ్గరకి తీసుకు వెళ్ళింది.

'మనం గోల్ మార్కెట్ వెళదాం డాడీ.'

'సరేనమ్మా' అతను డ్రెస్ మార్చుకున్నాడు.

''మనం 'పీర్ బాబా మందిర్'కి వెడదాం డాడీ.''

'ఒద్దమ్మా.'

''దేవుడి దగ్గరకి వెడదాం రండి డాడీ.''

'ఒద్దు.' భార్గవ అటు తిరిగి కళ్ళు తుడుచుకున్నాడు. కరుణ గమనించి వూరుకుంది. జీవితంలో థ్రిల్ తప్ప కష్టం ఎరుగదు భార్గవ. అటువంటిది ఈ భార్గవకి యిది గొడ్డలి పెట్టు మాదిరిగా వుంది.

కారు డ్రైవ్ చేస్తూ' మీఅమ్మకి నేనేం



15-12-1978 శుక్రవారం మొదలు

21-12-1978 గురువారంవరకు




**మేషం:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు. స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

**వృషభం:—** ప్రయాణాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిధునం:—** ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**కర్కాటకం:—** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తివ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు యేర్పడతాయి.

**సింహం:—** సాహసిక వ్యవహారాలుబాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారంఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు— అధిక వ్యయం జరుగుతుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**తుల:—** రావలసిన డబ్బు అందుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలుబాగుంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో అనవసరమైన వ్యయంచేస్తారు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారంఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మకరం:—** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాటివారితో మాట పట్టింపులు తగవు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులనుకల్సుకొంటారు. వారం ఆఖరులో చికాకులు యేర్పడతాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కుంభం:—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఇతరుల నిమిత్తం శ్రమపొందవలసివస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మీనం:—** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ అంచనాలు తారుమారుకాగలవు. స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

—మహేష్

---

## గవర్నెస్ కరుణ

తక్కువ చేశాను కరుణా. పన్నెండేళ్ళ తరువాత యిప్పుడిలా చేసింది ఏమిటి?' అన్నాడు అతను. కరుణ ఏమని జవాబు చెబుతుంది. 'మీరు యిచ్చిన చనువువల్ల యిలా అయింది అంటుందా? అమ్మనికూడాతాగించి మగాళ్ళతో సరిగ్గా తిప్పడం వల్ల యిలా జరిగింది అంటుందా?'

'నావల్ల ఏం లోపంవుంది చెప్పు. ఆమెకి యివ్వవలసిన స్వేచ్ఛ కన్నా ఎక్కువే యిచ్చాను. యిలా చేస్తుందని తెలిసి ఉంటే నేను వూరు రాకపోయేవాడిని!'

కరుణ వీపు మీద బలంగా చరిచినట్లైంది. క్షణంతరువాత తెప్పరిల్లింది.

'కూరలు కొందాం. కారుప్రక్కకిపార్కు చేయండి డాడీ!'

'దర్శన్ చేత తెప్పించుదాం. నేనిక్కడ అని నడవలేను!'

'యిప్పుడు మనమేం తప్పుచేశాం డాడీ.'

భార్గవ మాట్లాడలేకపోయాడు. కరుణ వెనుక బయలు దేరాడు.

గుప్తా పెద్ద పెనం పెట్టుకుని ఆలూ టిక్కీలూ, సమోసాలూ వేడి వేడిగా తయారు చేస్తున్నాడు. అతను చేసేగోల్ గప్పే అందరూ ప్రీతిగా తింటారు. 'ఛోలే' అంటే కరుణకి చాలా యిష్టం.

'మనం గుప్తా దగ్గరకి వెడదాం డాడీ.'

కరుణ మనసు కష్టపెట్టాలని లేదు భార్గవకి. అతను గుప్తాతో 'కరుణకి ఛోలే నాకు గోల్ గప్పే' అని ఆర్డర్ యిచ్చాడు.

ఇద్దరూ తిన్నాక మంచినీళ్ళు యిస్తూ గుప్తా 'పాపం మీకు చాలా కష్టం వచ్చింది కదూ' అన్నాడు.

భార్గవకి ఆ మాట వింటూనే వాంతి వచ్చినట్లు అయింది. 'సాబ్, సాబ్' అని అడుగులకు మడుగులు వొత్తే గుప్తా యిప్పుడు యింత ధైర్యంగా మాట్లాడుతున్నాడంటే మేనక తెచ్చిన తలవొంపులే కద? భార్గవ శరీరం కుతకుత వుడికిపోయింది. అతను జవాబు యివ్వకుండా బిల్ పే చేసి కారు స్టార్ట్ చేశాడు. కూరలు కొనలేదు. కారు యింటి మొహం పట్టింది. అతను కూతురికి 'గుడ్ నైట్' చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

(ఇంకా ఉంది)

# బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్

# 3 తరాల వారికి అదే కమ్మని రుచి



గ్రీన్ లేబిల్ : అనేక సం॥ల గా బామ్మగారు దాన్ని ఉపయోగిస్తున్న విధం



గ్రీన్ లేబిల్ : అమ్మ దాన్ని ఉపయోగిస్తున్న విధం



అదే గ్రీన్ లేబిల్ : మీరు మెచ్చుకొనే విధం మరియు మీరు ఉపయోగించే విధం

మూడు తరాల వారికి అభిమాని కావడంలో ఆశ్చర్య పడనవసరం లేదు. మరియు ఈ రోజు అందుకే అధికంగా అమ్ముడవుతుంది




**ఎల్లప్పుడూ శ్రేష్ఠమైనది, స్ట్రాంగైనది**

OBM-5709 A/1 TEL



## మందులు దొంగిలిస్తున్న డాక్టరు!

మధురజిల్లాకు చెందిన చిన్నాళపట్టి అనే గ్రామంలో వో ప్రభుత్వ ఆసుపత్రికి తనిఖీకి వెళ్ళిన తమిళనాడు ప్రభుత్వ ఆరోగ్యశాఖమంత్రికి ఓ డాక్టరుగారు రివ్వున ఎదురొచ్చి అట్టే వుండి పోయారట. ఆయన వాలకం చూసిన మంత్రి గారనుమానపడి "ఎన్నా" అని వాకబు చేసి, చేయిపెట్టే ఆ డాక్టరుగారి కోటు పాకెట్టులో వో ఖరీదైన మందుసీసా వున్నదట. అలవాటు పొప్పున ఆయనా రోజూకూడా మందులు ఎత్తుకు పోతున్నాడట. ఎందుకు! తన రోగులకు యివ్వడానికైయ్యుంటుంది.

## పార్లమెంటులో తమిళం!

జనతాలోంచి (అవునా!) బయటికి వచ్చి గాంధి కామరాజు దేశీయ కాంగ్రెసు అనే పార్టీని స్థాపించిన పార్లమెంటు సభ్యుడు కుమరి అనందన్ తాను యిహ పార్లమెంటులో ఇంగ్లీషులో మాట్లాడబోయేది లేదని, కేంద్ర ప్రభుత్వం హిందీని హిందీమాట్లాడని రాష్ట్రాలమీద వేసి రుద్దుతున్నారని, పండిట్ నెహ్రూ హామీని కూడా లక్ష్యపెట్టకుండా కేంద్రం ప్రవర్తిస్తోందని, దానికి నిరసనగా తానిహనుంచి తమిళ్‌లోనే మాట్లాడు తాననీ అన్నారట. అయ్యా పార్లమెంటులో ఏ భాషలో మాట్లాడినా ఒకటే!

## సగం తప్పా!

వ్యభిచారంలో కేవలం ఆడవారినే శిక్షించడం న్యాయం కాదనీ, అట్టి సందర్భంలో పురుషునిది కూడా సగం తప్పుంటుంది గనుక అతడినీ శిక్షించాలనీ అంటూందిదేశం యీమధ్య. వ్యభిచారంలో మగవాడిని కూడా శిక్షిస్తే తప్ప యీ వ్యభిచార నిర్మూలన జరగడం కుదరదని న్యాయమూర్తి రంగరాజన్ అన్నారట. వ్యభిచారంలో స్త్రీది తప్పు, మానభంగం, బలాత్కారాలలో పురుషునిది తప్పు అని కదా చట్టమున్నది.

## కేరళకు ఏట్లా 300 కోట్లు!

కేరళ రాష్ట్రంనుంచి అరబ్బుదేశాలకు వెళ్ళి వుద్యోగాలు చేసుకునే వారంతా తమ వారికి పంపే డబ్బు సంవత్సరానికి మూడువందలకోట్ల రూపాయలట. అనగా అరబ్బుదేశాలనుంచి కేరళ రాష్ట్రానికి ఏటికి మూడొందల కోట్లరూపాయలు దిగుమతి అన్నమాటేగా!

## జయాభాదురి కొత్త బాధ్యత!

నటుడు అమితాబ్‌బచన్ "ధర్మకాంత్" అనే సినిమాలో నటిస్తున్నాడట. ఆ చిత్ర నిర్మాత సుల్తాన్ తన భార్య షమ్మిని నానాబాధలూ పెట్టాడట. ఈ విషయం తెలుసుకున్న జయా భాదురి ఆ "ధర్మకాంత్"లో తన భర్త అమితాబ్‌ను నటించవద్దనీ, అతడు తన భార్యను చక్కగా చూసుకుంటే తప్ప ఆ సినిమాలో నటించనని తెలియచేయమనీ అన్నదట. జయా భాదురి నటనా జీవితాన్నుంచి కుటుంబ స్త్రీ జీవితానికి మారాక చలనచిత్ర పరిశ్రమలోని వారి భార్యల యీ విధమైన కష్టసుఖాలు విని వాటిని సరిదిద్దే బాధ్యత తాను తీసుకుంటున్నదట. గుడ్ సోషల్ వర్క్...

## చింపాంజీకి విదేశీ వరుడు!

జైపూరు జంతుప్రదర్శనశాలలోవున్న వో ఆడ చింపాంజి పెళ్ళికోసం తహతహలాడి పోతోందట. వరుణ్ణి విదేశాలనుంచి తెప్పించే ప్రయత్నం చేస్తోందట జంతుప్రదర్శనశాల అధికారుల వర్గం. గ్వాలియరు జంతుప్రదర్శనశాలలో వో మగ చింపాంజి వున్నదట. వీటి రెంటికి కలయిక ఏర్పాటు చేదామనుకుంటే గ్వాలియరు వారు కొన్ని షరతులు పెట్టారట. ఆ ఆడ చింపాంజిని గ్వాలియరు పంపాలని. గ్వాలియరులోనే గర్భం ధరించి, ప్రసవమయ్యే వరకూ వుండాలనీ ఆ పుట్టిన పిల్లనిగానీ పిల్లాడినిగానీ గ్వాలియరులోనే వదిలేసి, అప్పుడు జైపూరు వెళ్ళాలనీ అట ఆ షరతు. దీనికి జైపూరు వారొప్పక. మేం పెళ్ళికొడుకును విదేశంనుంచి తెప్పించుకుంటామోచ్ అన్నారట.

## ఆరోగ్య రహస్యమా!

ఇజ్రేల్‌కు చెందిన బార్ట్‌కా నివాసి 80 ఏళ్ళ షేక్ సులేమాన్‌కు 39 మంది భార్యలట. వీరందరికీ కలసి మొత్తం పిల్లలూ, పిల్లల పిల్లలూ కలిపి వో అయిదొందల మందట. సులేమాన్ తన ఎనభైయ్యో ఏట కూడా ఖులాసాగా దిలాసాగా వుంటాడట. తన ఆరోగ్యకారణాల్లో తన వివాహాలు కూడా ఒకటయ్యుంటాయని ఆయన నమ్మకట. ఈతని 39 మందిలో కొంతమంది లేచి పోయారట. మరికొంతమంది చనిపోయారట.

## పార్టీతోపాటే పుట్టిన కలతలు

వ్యక్తిగత ద్వేషాలు, తత్సంబంధమైన విరోధాలూ, పోట్లాటలూ జనతా పార్టీతోపాటు పుట్టాయని, కనుక అవి పోడానికి కొంతకాలం పట్టుందని జనతా చంద్రశేఖర్ అన్నారట. కాగా అంతవరకూ వోపిక పట్టే అవసరం జనతా (ప్రజలు)కు ఏమిటి? ఏదిఏమైనా తాను జనతా పార్టీలోంచి బయటికి వచ్చేది లేదనీ, వారంతట వారే తనను బహిష్కరిస్తే తప్ప తాను జనతా నొదలననీ చరణ్‌సింగ్ అన్నారట. అనగావారు అదీ ఏదుదు చూస్తున్నారా!

( గత సంచిక తరువాయి )

























[ఇంకా వుంది]

# జర్మన్ మహిళల దృక్పథంలో మార్పు!



[జర్మనీలోని మహిళలు పురుషులకు దీటుగా సమానహక్కులు సంపాదించ నున్నారు. అంతేకాదు. ఉద్యోగాలలో పురుషులకు ఏయే హక్కులు వుంటాయో ఆ హక్కులే తమకు కూడా కావాలని కొందరు వాదిస్తున్నారు. మహిళా సంఘాలలోనూ, పౌర కార్యశీల సంఘాలలోనూ వారిలో కొందరు చురుకుగా పని చేస్తున్నారు. ''పురుషుల మీద పెత్తనంచేసే సౌకర్యం'' తమకు వుండాలని కూడా కొంతమంది మహిళలు అభిలషిస్తున్నారు. అని 'స్కాలా' పత్రిక ఆరవ సంచికలో ఎరెకాస్కార్క్ వ్రాశారు. కానీ కొంతమంది మహిళల అభిప్రాయాలు యిందుకు భిన్నంగా వున్నాయి. వారు మరొకవిధంగా ఆలోచిస్తున్నారు. విముక్తి ఎన్నడో లభించిందని వారు భావిస్తున్నారు. వారిలో చాలామంది తల్లులు మాతృత్వంవైపు తమ దృష్టిని మళ్లించారు. మహిళా స్వాతంత్ర్యోద్యమానికి సంబంధించిన కొన్ని అంశాలను ఈ వ్యాసంలో చర్చించడం జరిగింది.]

ఇరువదినాలుగు సంవత్సరాల వయస్సు మహిళ డొరోతీ కిర్చ్‌బెర్గ్ నాలుగు సంవత్సరాల క్రితం మహిళలకు పూర్తి స్వాతంత్ర్యం కావాలని వాదించింది. కలలు కన్నది ఆరోజులకోసం. ఆ ఆశయసాధనకోసమే తాను బ్రతుకుతున్నట్టు ఆమె భావించింది. ఆరోజులలో ఆమె వాణిజ్య ప్రకటనల సంస్థలలో ఒకదానిలో పని చేస్తూండేది. 'ఈ పని చెయ్యి' అని మగవాడు తనకు చెప్పడానికి అనుమతించేదికాదు. మహిళా చర్చా సంఘాలలో చురుకుగా ఆరోజులలో ఆమె పాల్గొనేది. తన సహచరునితో ప్రతిరోజూ సాయంకాలం ఆమె వాదించేది. ఆ ఆసామీ తమ ఇంట్లో వారి దుస్తులన్నీ ఉతకవలసివచ్చేది. దాన్ని గురించే వాడి వాదోపవాదాలు.

అలాంటి రోజులలో ఎక్కడో ఏదో మలుపు వచ్చింది ఆమె జీవితంలో. ఆ అనుభవాన్ని డొరోతీ యిలా చెప్పింది : ''నిజానికి వారికి అవసరంలేని సరకులు కొనవలసినదిగా ప్రజలలో అదేపనిగా ప్రచారం చేయడం విసుగనిపించింది నాకు. అవన్నీ వట్టి కబుర్లు. శుష్కవాదోపవాదాలు, అర్థంపర్థంలేని మాటలు. అంతకంటే సహజంగా వుండే పని ఏదయినా చేయాలని నాకు అనిపించింది – ఒక శిశువును పెంచాలనిపించింది.''

## ఇరువురు బిడ్డలు

ఆమె యీనాడు ఇరువురు బిడ్డల తల్లి. ఇంటి పనులలో పూర్తిగా ఆమె నిమగ్నమవు తున్నది. వస్త్రాలను శుభ్రంచేసే యంత్రం, భోజన పాత్రలను శుభ్రంచేసే యంత్రం వంటివి తన యింట్లో వున్నా వారానికి అరువదిగంటలు ఆమె పని చేస్తున్నది. తనకు యిప్పుడు తృప్తిగా వున్నదనీ – కనీసం ఆ వాణిజ్య ప్రకటనల సంస్థలో పని చేసిన రోజులలో కంటే యిప్పుడు తనకు ఎక్కువ తృప్తిగా వున్నదని ఆమె అంటున్నది.

బిడ్డలతో యిలా హాయిగా జీవిస్తున్న మహిళ ఒక్క డొరోతీ కిర్చ్‌బెర్గ్ మాత్రమే కాదు. ప్రయోజనకరమయిన వృత్తులలో లేరని అధికారులు లెక్కవేస్తున్న ఒక కోటీ అరువది లక్షల మంది జర్మన్ మహిళలు స్త్రీ స్వాతంత్ర్యోద్యమవాదులు వర్ణిస్తున్నంతఅలసులుగా లేరు. ఒకప్పుడు ఏదో ఒక ఉద్యోగం చేసిన మహిళల విషయంలోనయినా యీ మాట ముమ్మాటికీ నిజం. వివాహం చేసుకొని, ఉద్యోగమేమీ చేయనట్టి మహిళలలో 18, 54 సంవత్సరాల వయస్సు మహిళలలో చాలామంది తృప్తిగా జీవిస్తున్నారు. హెల్‌గె ప్రోస్ అనే (సోషియాలజిస్ట్) సాంఘిక శాస్త్రవేత్త జరిపిన పరిశీలనలో యీ విషయం నిరూపితమయింది. ఇంతేకాదండీ! మహిళల అభ్యున్నతి గురించి వెలువడుతున్న సాహిత్య వెల్లువ వర్ణించుకున్నంత ఘోరంగా గృహిణి యీనాడు దుర్భరస్థితిలో జీవించడంలేదని – అదంతా శుద్ధ అబద్ధమని కూడా యీ పరిశీలన నిరూపించింది. ఒక ఉదాహరణ: ఈ పరిశీలనలో ప్రశ్నించిన గృహిణులలో నూటికి 75 మంది ఒంటెద్దు జీవితం గడుపుతున్నట్టు భావించడంలేదు. తమ బంధువులనూ మిత్రులనూ వారు కలుసుకొంటూనే వున్నారు. ఇంటి పనులతో నిరంతరం వారు సతమతమవడంలేదు.

వారి ఖర్చుల సమస్యలను భార్యాభర్తలు పరిష్కరించుకొంటున్నారు హాయిగా. మూడవసారి వివాహం చేసుకొనే మహిళలు ఆర్థిక వ్యవహారా లన్నింటికీ వారే బాధ్యత వహించాలి. కాగా ఒక గృహిణి దైనందిన జీవితం – వివాహం చేసుకొన కుండానే ఉద్యోగాలు చేసే మహిళల జీవితం కంటే ఎక్కువ విసుగు కలిగించేదిగా గానీ శ్రమ కలిగించేదిగా గానీ లేదని – పైన పేర్కొన్న ఉదంతాల ఆధారంగా హెల్‌గె ప్రోస్ అభిప్రాయ పడింది.

ఇంతేకాకుండా ఉద్యోగాలు చేసే అవివాహిత మహిళలు అదనంగా కొంత వత్తిడి వంటి వాటికి గురి కావలసి వస్తున్నది.

## మాతృత్వంపట్ల ఆసక్తి

నురెంబర్గ్ సొసైటీ ఫర్ కన్‌సంప్షన్, సేల్స్ అండ్ మార్కెట్ రిసెర్చ్ మరొక పరిశీలన జరిపింది. స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా జరుగుతున్నప్పటికీ, మహిళలలో 40 శాతం మంది అన్నింటి కంటే "మాతృత్వానికి" యీనాడు అధిక ప్రాముఖ్యం ఇస్తున్నారని ఆ పరిశీలనలో తేలింది. 1967లో కంటే ఈ సంఖ్య పదిశాతం తక్కువ. అంత మాత్రాననే సాంఘికంగానూ, రాజకీయంగానూ తాము విముక్తి పొందినట్లు వారు భావిస్తున్నారని అనుకొనరాదు.

పై విషయాన్ని విశదం చేసే మంచి ఉదాహరణ :— ప్రతి ముగ్గురు మహిళలలో ఒక్కరికి మాత్రమే 1975 అంతర్జాతీయ మహిళా సంవత్సరం అని తెలుసు. 1975 లోనే జరిగిన ఒక పరిశీలనలో యీ అంశం విదితమయినది. ఇంతకు ముందువలనే యీనాడు కూడా పెక్కుమంది మహిళలకు రాజకీయాల పట్ల కంటే అలంకరణ సరంజామా పట్లనే అధిక శ్రద్ధ.

### స్త్రీ అంటే ?

1960 లో వెలువడిన హెర్‌డర్స్ లాంగ్వేజ్ బుక్‌లో స్త్రీ అంటే ఇలావున్నది. ఒక మహిళ పెరిగి పెద్దయిన మానవజీవి... పెరిగి పెద్దవాడయి శత సంపన్నుడయిన మానవజీవి పురుషుడు.

1954 లో వెలువడిన లార్జ్ హెర్‌డర్ గ్రంథం యిలా చెబుతుంది : ఈ విశాల విశ్వంలో తన భర్త జీవితానికి భార్యగా పరిపూర్ణతను సమకూర్చే స్వతంత్ర బాధ్యత గలది అనే అర్థంలో, కుటుంబంలోని బిడ్డల తల్లిగా — పురుషునికి చేదోడు వాదోడుగా వుండే సహాయకారి స్త్రీ. (ఐ. మోసెస్ 2. 18.)

జనరల్ జర్మన్ రియల్ ఎన్‌సైక్లోపేడియా ఫర్ ఎడ్యుకేటెడ్ క్లాసెస్ (1852) లో యిలా వున్నది : "న్యాయ చట్టానికీ, విధ్యుక్త ధర్మానికీ, గౌరవానికీ, భావాలకూ పురుషుడు ప్రతినిధి అయినట్లే, నీతికీ, ప్రేమకూ, లజ్జకూ, తక్షణ ఉద్రేకాలకూ స్త్రీ ప్రతినిధి."

---

"మహిళలు సోమరులు. తమకోసం పురుషులు పనిచేయాలని అభిలషిస్తారు. ఆలోచించడం మగవారి బాధ్యత అని భావిస్తారు." వైద్యశాస్త్రంలో డాక్టరు, మంచి రచయిత్రి. పురుషులను సమర్థించేది అయిన ఎస్‌కర్ విలార్ చెప్పిన మాటలలో ఏమంత పెద్ద తప్పు లేకపోవచ్చు. కాని ఇది కూడా ఏకపక్ష వాదనయే. ఎందుకనంటే ఈ రోజులలో వంటఇల్లు కేవలం గృహిణి సామ్రాజ్యం మాత్రమే కాదు. అదంతా జరిగిపోయిన కథ.

ఉదాహరణకు — దుస్తులను ఇస్త్రీ చేసేపని మిగిలిపోయినదనుకోండి. డొరోతీ కిర్చ్‌బర్గ్ యీ రోజులలో బాధపడదు. ఎందుకనంటే సాయంత్రం వేళ పిల్లలకోసం ఆమె కథలు వ్రాస్తుంది — రాజకీయ సమావేశాలవంటి వాటికి ఆమె అప్పుడప్పుడు వెడుతుంది. వెళ్ళాలని అనిపించినప్పుడు బిడ్డలందరితో తమ మోటారుకారులో విహార యాత్రలకు వెడుతుంది. మోటారుకారు స్టీరింగ్ వీల్ వెనుక కూర్చున్నప్పుడే నిజంగా తనకు స్వేచ్ఛ లభించినట్టు తనకు అనిపించుతుందని డొరోతీ అంటుంది. మహిళలు మోటారుకార్లను నడుపుతుంటే 1960 లో ఆరులక్షలమంది మహిళలను మాత్రమే పురుషులు ఎగతాళి చేసేవారు. ఈనాడు ఆ పరిస్థితి మారిపోయింది. నలభై లక్షలమంది మోటారుకార్లు నడుపుతూ స్వేచ్ఛననుభవిస్తున్నారు — మోటారుకార్లను నడిపే పురుషులను ఈనాడు వారే ఎగతాళి చేస్తున్నారు. పురుషుల కంటే వారే బాగా కార్లను నడుపుతున్నారు. రవాణా సౌకర్యాల నిపుణులు యీ అంశాన్ని ధృవీకరించుకున్నారు. మహిళలు విముక్తి పొందారనడానికి వారు మోటారుకార్లను నడపడం ఒక్కటే నిదర్శనం కాదు. అయినా తమకు కావలసిన డబ్బు తామే సంపాదించుకోగలగాలన్న అవగాహన మహిళలలో పెరిగిన దనడానికి ఇదొక సూచన.

## సాహిత్యంలో కూడా

సాధారణ మహిళలలోనూ, గృహిణులలోనూ కూడా కొత్తగా వచ్చిన ఆత్మావగాహనా భావనను గురించిన పుస్తకాలుకూడా వస్తున్నవి. కరిన్‌స్ట్రక్ అనే రచయిత్రి — ఇరువురు బిడ్డలతల్లి. ప్రకృతి సిద్ధమయిన మహిళల మాతృత్వ వాంఛ గురించి ఆమె తన పుస్తకాలలో వ్రాసింది. "లవ్స్" అనే పేరున ఆమె ఒక నవల వ్రాసింది. చాలా తప్పుదార్లన జీవితయాత్ర సాగించిన ఒక వనిత, మత్తుమాత్రలకు అలవాటుపడిన ఒక పురుషుణ్ణి తుదకు కలుసుకొని, అతనితో సన్నిహితసంబంధం ఏర్పరచుకొంటుంది—సుఖపడుతుందని ఆ నవలలో వున్నది. ఆ వనిత పురుషుని భాగస్వామిగా — తుదకు తల్లిగా పరిణమిస్తుంది. "ది మదర్" అనే నవలలో పిల్లలను కనే మహిళగా ఒక వనిత సుఖసంతోషాల ననుభవించుతుంది.

ఇలాంటి సాహిత్యం పురుషులకు కూడా బహుళా తృప్తికలిగించుతుంది. డొరోతీ కిర్చ్‌బర్గ్ గాని, కరిన్‌స్ట్రక్ నవలలోని పాత్రలుగాని గత కాలంలో మౌనంగా తమ భర్తలకోసం ఇంటివద్ద ఎదురుచూస్తూ కూర్చునే సుందరాంగులు కానే కాదు.

అంత మాత్రాననే ప్రతిగృహిణీ సాయంత్రం వేళల కథలు వ్రాస్తూంటుందని అనుకొనరాదు — భవిష్యత్తులో కూడా అంతర్జాతీయ మహిళా సంవత్సరాలను గృహిణులు నిర్లక్ష్యం చేస్తారనీ అనుకొనరాదు.

ఇదంతా ఇలా జరుగుతున్నప్పటికీ ఏదో ఒక ఆదర్శంకోసం కృషిచేసే మహిళల సంఖ్య పెరుగుతున్నది. కుటుంబాల వ్యవహారాల మంత్రిత్వ శాఖ ఒక పరిశీలన జరిపింది. తమ సమాజానికి ఉపయోగపడే ఏదో ఒక కార్యక్రమంలో — తీరిక వేళలలో పాల్గొనడం తమ అభిమతమని, ఆ పరిశీలనలో ప్రశ్నించిన మొత్తం మహిళలలో నూటికి అరవైమంది సమాధానం చెప్పారు. ఇలా ఒకవేళ జరుగకపోతే — మహిళల సోమరితనం — దానికి కారణం కాదు. వారు నివసించే ప్రాంతాలలో అలాంటి అవకాశాలు లేకపోవడమే కారణం. అయినా జర్మనీలో వెయ్యిమంది సభ్యులున్న పౌర కార్యశీల సంఘంలో మహిళలకు కూడా పురుషులతో సమానంగా ప్రాతినిధ్యం వున్నది.

పురుషులు తమ స్థానిక సంఘాల సమావేశాలకు వెడుతున్నట్టే గృహిణులు కూడా 'సిటిజన్స్ ఇన్‌షియేటివ్' సంఘం సమావేశాలకు సాయంత్రం వేళ వెడుతూంటారు. ఇంటిని అంటిపెట్టుకొని తమ ఇల్లాండ్రు వుండాలని అభిలషించే భర్తలు ఈ కొత్త పరిస్థితి కనుగుణంగా సర్దుకుపోవలసి వుంటుంది.

['స్కాలా' పత్రికకు కృతజ్ఞతతో — వి.ఎస్.ఎ.]

---

### పిల్లా - పిల్లీ

— ఫోటో : ఎస్. శివనారాయణ






**( గత సంచిక తరువాయి )**

బుధవారం మధ్యాహ్నం లంచ్ అవర్‌లో రాడికల్ స్టూడెంట్స్ మీటింగ్ పెట్టారు. శంకరరావు వెళ్లేసరికి వనజ మాట్లాడ్తోంది. వింటున్నవాళ్లలో కృష్ణకాంత్ భట్ ఉన్నాడు. శంకరరావు కృష్ణ పక్కకు వెళ్లి పలకరించాడు.

"రాడికల్స్‌మి అయిన మనకి దేవుడి మీద నమ్మకం లేదు. కాని హరే రామ హరే కృష్ణ మతస్థులను, రోడ్లమీద పాటలు పాడుతూ చందాలు వసూలు చేస్తున్నందుకుగాను వాగబాండసీ ఏక్ట్ కింద అరెస్టు చెయ్యడం అధర్మం. అది న్యాయమే అయితే మరి సాల్వేషన్ ఆర్మీ సంగతి ఏమిటి? వాళ్లూ బాండులు వాయిస్తారు. వాళ్లూ ముష్టెత్తుతారు. వాళ్లని ఎవరు ఎప్పుడూ అరెస్టు చేసినట్టు వినలేదు. పైగా ప్రభుత్వం ప్రోత్సాహం ఇస్తుంది. ఇన్‌కమ్ టాక్స్‌లో ఆ విరాళాలకి పన్ను వదిలేస్తుంది. హరే రామ హరే కృష్ణ వాళ్లు, సాల్వేషన్ ఆర్మీవాళ్లు రెండూ మత సంస్థలే. రెండూ ఛారిటబుల్ ఆర్గనైజేషన్సే. కాని ఒక్క తేడా ఉంది. మొదటిది హిందువులది. రెండోది క్రైస్తవులది. ఆ కారణంగా మొదటివారిని శిక్షిస్తున్నాం. రెండో వారిని నెత్తిమీద పెట్టుకొంటున్నాం. ఈ పని చేస్తున్నది వ్యక్తులు కాదు. ప్రభుత్వం! పక్షపాతం ఏ విషయంలోను చూపించరాని ప్రభుత్వం! ఇమ్మిగ్రేషన్ లాస్‌లో తెల్లవాళ్లకి నల్లవాళ్లకి తేడా లున్నాయి. ఉద్యోగాలివ్వడం విషయంలో తెల్లవాళ్ల పట్ల పక్షపాతం చూపిస్తోంది ప్రభుత్వం. ఇవాళ్టితో మరో మెట్టు ఎక్కింది. నల్లవాళ్ల మతం అవలంబిస్తే తెల్లవాళ్లు శిక్షార్హులు అని తేటతెల్లం చేసేపని చేసింది, ప్రభుత్వం. దాన్ని ఈ విద్యార్థి బృందం గర్హిస్తోందన్న తీర్మానాన్ని నేను ప్రతిపాదిస్తున్నాను" అంటూ తీవ్రంగా వనజ ప్రతిపాదించింది. బాబ్ స్మిత్ లేచి "వనజ ప్రతిపాదనని నేను బలపరుస్తున్నాను" అన్నాడు. తీర్మానం ఆమోదం పొందింది.

శంకరరావు, కృష్ణకాంత్ భట్ కాంటీన్‌వేపు నడిచారు కాఫీ తాగుదామని. స్టూడెంట్స్ కేఫ్‌లో క్యూలో నిలబడి కాఫీ తీసుకొన్నారు. ఓ మూలగా ఉన్న బల్లదగ్గర కూర్చున్నారు.

"వనజ హరే రామ హరే కృష్ణ వాళ్లకి సాల్వేషన్ ఆర్మీ వాళ్లకి పోలిక బాగా తెచ్చింది" అన్నాడు కృష్ణ.

"ఈ సాల్వేషన్ ఆర్మీవాళ్లని నేనింకా చూడటం పడలేదు" అన్నాడు శంకరరావు.

"శనివారాలు షాపింగ్ సెంటర్స్‌లో కనిపిస్తారు. కొందరు ఇళ్లకి వచ్చి పాతబట్టలు అవీ అడిగి పట్టుకుపోతారు. వీటిని వాళ్ల షాపుల్లో అమ్ముతారు. క్లేటన్ బజారు చివరి షాపు వాళ్లదే చూసావా?"

"లేదు."

"చూడు సరదాగా ఉంటుంది. నేనొకసారి వెళ్లాను. అక్కడ ఓ కొత్త కోటుంటేపే దాని ధర అడిగాను. కొందరు కొత్త బట్టలు కొనుక్కుని సరిపోకపోతే విరాళంగా ఇచ్చేస్తారు. చచ్చిపోయిన వాళ్ల బట్టలు కూడా అక్కడికి చేరుకొంటాయి. అవి చాలా చవకగా అమ్ముతారు. బజార్లో ఎంత చచ్చుకోటైనా పది డాలర్లుంటుందా ఆ కోటు ఖరీదు రెండు డాలర్లు చెప్పారా షాపులో. అంత కంటే తమాషా అయిన విషయం ఏమిటో తెల్సా! ధర చెప్పాక నాకేసి తేరిపారచూసి 'నీకైతే ఉత్తినే ఇస్తాం' అన్నారు. నేను ఇండియన్ కదా! వాళ్లు ఇండియన్ల దరిద్రం రోజూ టి. వి. లో చూస్తారు. ఇండియన్లు ఎంత దరిద్రులో వాళ్లకి తెలిసినంతగా మన దేశంలో ఏ మంత్రికి తెలియదు! వాళ్ల టి. వి. కెమెరామెన్ దేశంలోని అన్ని మూలలకి వెళ్లి మన దరిద్రాన్ని సినిమా తీస్తారు. ఇంతకు నాకు ఛారిటీ అక్కర్లేదు. రెండు డాలర్లిస్తా నన్నాను. ఛారిటీ అక్కర్లేనివాడివి ఈ షాపులో కొనడాని కెందుకువస్తావ్, అన్న ధోరణిలో వాళ్లు మాట్లాడారు. ఆఖరికి అర్ధ డాలర్‌కి ఇవ్వటానికి ఒప్పుకొన్నారు. ఇంతకు ఆ కోటేదో తెల్సా? ఇవాళ నేను వేసుకొన్నదే. నా సొమ్మేంపోయింది! ఆ మరుసటి వారం ఓ డాలర్ పెట్టి షీలకి మంచి ఓవర్ కోటు కొన్నాను" అని చెప్పాడు కృష్ణ.

"నీ కోటు చాలా బావుంది. కాని వాళ్లు మనల్ని బిచ్చగాళ్లతో జమకట్టి మన మతాన్ని బిచ్చగాళ్ల రెలిజన్‌గా లెక్కపెట్టి అరెస్టులు చెయ్యడం చాలా బాధ కలిగించడంలేదూ?" అని అడిగాడు శంకరరావు.

"డాలర్లు కావలసినవాళ్లు, విదేశీ వ్యామోహం కలవాళ్లూ కొన్ని అవమానాలు భరించక తప్పదు. మనం థిక్ స్కిన్ డెవలప్ చెయ్యాలి. మన దేశంలో బీదవాళ్లు టూరిస్టు ఫారినర్స్ చుట్టూ మూగుతారు. డబ్బున్నవాళ్లు విదేశీసరుకులచుట్టూ మూగుతారు. చదువుకొన్నవాళ్లు, విదేశాలు వెళ్లటానికి మూగుతారు. మనది మానసికంగా బిచ్చగాళ్లదేశం. ఆ విషయం ఒప్పేసుకొంటే ఏ బాధా ఉండదు. నేను నిర్మొహమాటంగా ఒప్పుకొంటాను. దానివల్ల లాభం ఉంటే పొందుతాను" అన్నాడు కృష్ణ. కాఫీలు తాగడం పూర్తయ్యాక లేచి ఎవరి డిపార్ట్‌మెంట్లకి వాళ్లు వెళ్లారు.

ఆ రోజు కంచంలో అన్నీ వడ్డించుకొని టి. వి. కి ఎదురుగా కూర్చున్నారు శంకరరావు, పార్వతి. టి. వి. లో హరే రామ హరే కృష్ణ వాళ్ల అరెస్టులు చూపించారు. ఆ పైన అరెస్టయిన పిల్లల తల్లిదండ్రులతో జరిపిన ఇంటర్‌వ్యూలు చూపించారు. అందులో జోన్ వుంది. చాలా ఉద్రేకంగా మాట్లాడింది. "ఆ మిషన్ మూసేయాలి. ఆ స్వాముల్ని ఆస్ట్రేలియా నుంచి తరిమేయాలి. అప్పుడే నా గుండెల్లో మంట చల్లార్తుంది" అంది. ఇంకో ఆవిడ "ప్రపంచంలో క్రీస్తు భగవానుడు జన్మించాక మిగిలిన మతాల అవసరం పోయింది. అవన్నీ నశించక ఇంకా కొన్ని మిగిలి ఉండటంలో మనుష్యులలో అజ్ఞానం ఎంత ఉందో తెలుస్తోంది. దానికే దేవదూత సందేశాలు అందరికి, అన్ని మూలలా అందజెయ్యాలి. అప్పుడు ఈ కుక్కగొడుగులలాంటి మత సంస్థలు నశిస్తాయి" అంది.

ప్రపంచంలోని అన్ని మతాలలోకి వైదిక మతం గొప్పదని, ఆ విషయం అందరు ఒప్పుకొన్నదేనని చిన్నప్పటినుంచి వింటూ వచ్చిన శంకరరావుకి, పార్వతికి ఇది ఓ కొత్త అనుభవం. మన మతం గురించి ఆవగింజంతైనా నమ్మకం లేని ప్రజలు ప్రపంచంలో సగంపైన ఉన్నారు. అల్లా ఆలోచిస్తే ఏమతం విషయంలో అయినా అంతే! అల్లాంటప్పుడు, అంటే ప్రపంచంలో అత్యధికులు, ఏ మతం తీసుకొన్నా, మతేతరులుగా ఉన్నప్పుడు ఈ మతాల విలువేమిటి? వీటి క్రెడిబిలిటీ ఏమిటి? దేవుడనేవాడు, ఈ మతాల్లో చెప్పే ఏ దేవుడు కాకుండా వేరుగా ఉన్నాడా? అంటూ శంకరరావు, పార్వతి చర్చలో పడ్డారు. కొంత దూరం పోయాక పార్వతి చర్చ పొడిగించడానికిష్టపడలేదు.

## 8

మే నెల వచ్చింది. విపరీతమైన చలిని తెచ్చింది బాబుకి పార్వతికి జలుబు చెయ్యటం తరచుగా జరుగుతోంది. జలుబుకి రెండే రెండు మందు లున్నాయని చెప్పాడు డాక్టరు. చేతనైనంత విటమిన్ సి తీసుకోవడం. పడుకునేముందు మందులాగా బ్రాందీ తాగటం. ఇంట్లో అన్నం దగ్గర మంచినీళ్ల బదులు పళ్లరసం తాగాలను కొన్నారు. పార్వతికి బ్రాందీ రుచి నచ్చలేదు

---

***జరిగిన కథ - 6 :*** కొత్త జీవితం గడపటానికి స్వదేశం నుండి ఆస్ట్రేలియా వెళ్లిన శంకరరావుని, పార్వతిని — రంగస్వామి, ప్రొ. బ్రౌన్‌లు సాదరంగా ఆహ్వానించి వాళ్ల ఫ్లాట్‌కి తీసుకువెళ్తారు. పార్వతి టీచర్ ఉద్యోగానికి ప్రయత్నించి నిరాశ చెందుతుంది. తర్వాత కొన్నాళ్లకు ఒక బట్టల కంపెనీలో ఉద్యోగానికి చేరుతుంది. ఉన్నంతలో 'వినాయక చవితి' పండుగ జరుపుకుంటారు శంకరరావు దంపతులు. శంకరరావు పనిచేస్తున్న యూనివర్శిటీలోని విద్యార్థులు తమ జీతాలు తగ్గించాలని ఆందోళన చేస్తుంటారు. శంకరరావు, రంగస్వామి కారును కొందామని ప్రయత్నాలు జరుపుతుంటాడు. హరే రామ, హరే కృష్ణ సమాజంలో చేరిన హారీని తవ తల్లి 'జోన్' పడే బాధను తెలిపి, ఇంటికి వచ్చేయమంటాడు శంకరరావు.

తియ్యటి షెర్రీ తీసుకోడం నేర్చుకొంది. మొదట మందులా తాగటం మొదల పెట్టాక, అది కలగజేసే మత్తులోని ఆనందానికి అలవాటు పడింది. క్రమేపి అన్నం దగ్గర వైన్ను, పడుకోబోయేముందు షెర్రీ, పోర్టు, వెర్‌మౌత్‌లు కొద్దికొద్దిగా తాగటం అలవాటైంది. బాబు కూడా పాలల్లోనో, జ్యూస్‌లోను బ్రాందీ కలిపితే తాగి సుఖంగా నిద్రపోవడం చేస్తున్నాడు.

ఓ శుక్రవారం సాయంత్రం చలికి తోడు వాన మొదలైంది. బాబు అన్నం తిని పడుకొన్నాడు. ఎలక్ట్రిక్ హీటర్ వేసుకొని టి. వి. ముందర కూర్చున్నారు. టి. వి. లో హూ ఈజ్ ఎఫ్రైడ్ ఆఫ్ వర్జీనియా వుల్ఫ్ వస్తోంది. ఎలిజిబెత్ టైలర్, రిచర్డ్‌బర్టన్ బాగా తాగినట్టు నటిస్తున్నారు.

''అంతచేటు ఎందుకు తాగుతారో'' అంది పార్వతి.

''అందులో ఏదో ఆనందం ఉండి ఉండాలి'' అన్నాడు శంకరరావు.

''మనకెప్పుడూ అలాంటి ఆనందం కలగ లేదేం ?''

''మనం ఎప్పుడూ అంతలా తాగలేదు కదా.''

''తాగితే వస్తుందా ?''

''వస్తుందో లేదో తాగిచూద్దామా ?''

పార్వతికి ఆ స్థితి ఎల్లా ఉంటుందో చూడాలన్న కుతూహలం కలిగింది. మొదటిసారి తాగటానికి మనుష్యులు జడుస్తారు. ఆ కట్టు దాటాక ఆ భయం ఉండదు.

''కాని రేప్పొద్దున్న లేవగలమా ?''

''లేవకపోతే వచ్చిన నష్టమేమిటి ? పాలవాడు అక్కడ పాలు పెట్టిపోతాడు. న్యూసు పేపరువాడి కోసం లేవక్కర్లేదు. పనిమనిషి లేదు. రాదు. ఈ దేశంలో అదో పెద్ద సుఖం.''

''మనం ఎంతసేపు కావాలంటే అంతసేపు సుఖంగా నిద్రపోవచ్చును ఎవరూ వచ్చి లేపరు.'' అన్నాడు శంకరరావు.

ఆ రోజువే కొన్న షెర్రీ బాటిల్, వైన్ బాటిల్, బ్రాందీ బాటిల్ తీసుకువచ్చాడు. గ్లాసులో షెర్రీ వంచాడు. యథాప్రకారంగా పార్వతి గొంతుకలో వంచుకొంది. రెండో రౌండు కూడా అంత త్వరగా పూర్తిచేసేసరికి పార్వతికి తల తిరగటం, మాట తడబడటం మొదలైంది.

''నాకు బాగా మత్తు వచ్చింది'' అంది.

''నాకు రాలేదు'' అన్నాడు.

''మీరు కూడా త్వరగా తాగండి వస్తుంది'' అంది.

''నేను నెమ్మదిగా తాగుతాను'' అన్నాడు.

షెర్రీ బాటిల్ పూర్తయ్యేసరికి ఇద్దరికి మత్తు బాగా వచ్చింది. ఆపైన వైన్ బాటిల్ తీసాడు శంకరరావు. చెరో గ్లాసు వైను తాగారు. రకం మార్చినందువల్ల త్వరగా కిక్ వచ్చింది. తాగటం తాగి తమాయించుకోటం ఓ పెద్ద కళ. కొత్తగా తాగటం మొదలుపెట్టేవారికది తెలియదు.

''డాన్సు చేద్దామా ?'' అడిగాడు పార్వతి నడుంచుట్టూ చెయ్యి వేస్తూ శంకరరావు. టి. వి. సినిమాల శబ్దం నేపథ్య సంగీతంలా అనిపిస్తుంటే రెండు అడుగులు వేసారు. మరో గ్లాసు వైను తాగేసరికి మనస్సు బాగా వశం తప్పింది.

''నాట్యం చేస్తుంటే చాలా మజాగా ఉంది.''

''నాకు మీతో చేస్తుంటే చాలా బావుంది.''

''నీతో చేస్తుంటేనే ఇంత బావుంటే మరొకళ్ల భార్యతో చేస్తుంటే ఎంత బావుంటుందో !''

పార్వతి ఎంత తాగినా తన జాగ్రత్తలో తనుంది. ''నాకు మాత్రం ఎవరితోను చెయ్యాలని లేదు.''

''నాకుంది.''

''ఉంటే ఉండనీయండి.''

బ్రాందీ కూడా పూర్తిచేసేసరికి మనస్సు పూర్తిగా వశం తప్పింది.

''పరాయి ఆడదానితో డాన్సే అంత బావుంటే...''

''బావుంటే... ?''

''పొందు ఇంకెంత బావుంటుందో !''

మామూలుగా అయితే పార్వతిల్లాంటి మాటలకి కోపగించుకొనును. కాని తాగివుందేమో మనసు బలహీనంగా వుండి ఏడుపు మొదలు పెట్టింది ''దేశంకాని దేశంలో వన్నన్యాయం చెయ్యకండి'' అంటూ.

''నీకూ ఆ అవకాశం ఇస్తే. యూ కెన్ ఆల్సో ఎంజాయ్ ... లెట్ మీ ఎంజాయ్'' మాటలు బాగా ముద్దగా వచ్చాయి. శంకరరావు టి. వి. ఆపి పార్వతిని పడక గదిలోకి నడిపించుక వెళ్లాడు. శంకరరావుకి చాలా ఉద్రేకంగా వుంది. పార్వతికి చాలా ఏడుపు వస్తోంది. మొత్తం అంతా రసాభాస అయింది.

''నాకిండియా వెళ్లిపోవాలని వుంది'' అంటూ నిద్రపోయింది పార్వతి. అది నిద్రకాదు. అదో రకం మత్తు. ఆ మత్తులో కలలు ... శంకరరావు వనజవెంట, షీల వెంట పరుగెత్తుతున్నట్టు. తనని శంకరరావు, కృష్ణ దగ్గరకి బలవంతంగా నెట్టుతున్నట్టు. వైఫ్ స్వాపింగ్ లాంటి మాటలు వినబడుతున్నాయి. భయంతో చెమటలుపోసాయి పార్వతికి. నాలిక పిడచగట్టుకు పోయింది. తూలుతూ వెళ్లి కొళాయిలో నీళ్లు పట్టుకు తాగింది.

మరో గంట గడిచేసరికి పార్వతికి వాంతి అయ్యేలా అనిపించి బాత్‌రూమ్‌లోకి వెళ్లి బేసిన్‌లో వాంతి చేసుకొంది. కళ్లు తెరుచుకోవడంలేదు. తలంతా దిమ్ముగా వుంది. మరో అరగంటకి మరోసారి వాంతిచేసుకోడానికి పార్వతి లేచినపుడు ''మజ్జిగ తాగు పార్వతీ !'' అన్నాడు శంకరరావు.

పొద్దున్న అయ్యేసరికి నాలుగైదు వాంతులు వెళ్లి పార్వతి నీరసపడింది. చాలా వికారంగా నీరసంగా వుంటే మంచంమీదనుంచి లేవలేక పోయింది. శంకరరావుకి అంత హాంగోవర్ రాలేదు. లేచి కాఫీ చేసి యిచ్చాడు. పంచదార లేకుండా యిచ్చాడు. న్యూసుపేపరు, పాలు లోపలికి తెచ్చాడు. బాబుకి బ్రేక్‌ఫాస్టు తయారు చేసాడు. ఆఖరికి లంచ్ టైమయినా పార్వతి లేవలేదు. శంకరరావే అన్నం వండి నిమ్మకాయ




బద్దతో అన్నం కలిపి పార్వతిచేత తినిపించాడు. అన్నం తింటూ పార్వతి,

''షీల వాంతులు, వికారం కూడా ఇల్లాంటివే వనిపిస్తోంది. వనజ చెప్పింది నిజమే. షీల అన్నీ అబద్ధాలు చెప్తుంది. వాళ్లిద్దరు సుబ్బరంగా తాగుతారు. తాగనట్టు కబుర్లు చెప్తారు'' అంది.

''అయివుండవచ్చు'' అన్నాడు శంకరరావు.

*　*　*

ఆ మరుసటివారం శనివారం రాత్రి షీల, కృష్ణ కబుర్లు చెప్పటానికి వచ్చారు. కబుర్లు చెప్పుకొంటుండగా శంకరరావు గ్లాసులో షెర్రీ

పోసి తీసుకువచ్చాడు. కావాలని మొదటిగ్లాసు పార్వతి కిచ్చాడు. తనాడబోయే నాటకం గురించి ముందరే శంకరరావు పార్వతితో చెప్పాడు. అందుకని పార్వతి వద్దనకుండా తీసుకొంది. తరువాతి గ్లాసు కృష్ణ కిచ్చాడు. మూడో గ్లాసు షీల కివ్వబోయి ఆగి "మీరు తాగరేమోకదా! మా యింట్లో మేమిద్దరంకూడా సోషల్ డ్రింకింగ్ చేస్తాం" అన్నాడు.

షీల కంగారుపడింది. వద్దంటే శంకరరావు ఇహ శేకాకుండా ఇంకెప్పుడూకూడా ఆఫర్ చెయ్యడు. కావాలంటే, యిన్నాళ్ళ తను చెపుతూ వచ్చిన పెద్ద కబుర్లు ఉత్తకబుర్లని తెలిసిపోతుంది. షీల సందిగ్ధావస్థ చూసి కృష్ణ "తీసుకో షీలా!" అని షీలతో అని, "షీల కూడా కంపెనీకి తాగుతుంది. ఇక్కడున్న ఇండియన్ లేడీస్ అంతా యింతో అంతో తాగుతారు. కాని ప్రవీవాళ్ళ మడికట్టుకొన్నట్టు మాట్లాడ్తారు. అందుకని వాళ్లతో అల్లా అంటుంది" అన్నాడు శంకరరావుతో.

"మరే! ఎప్పుడైనా కొంచెం పుచ్చుకోడానికి అభ్యంతరంలేదు. కాని కొని ఇంట్లో ఎప్పుడూ వుంచం" అంది షీల.

అందులోను, మీరైతే యింట్లో బాటిల్స్ పెట్టుకొంటారుగాని, మేమల్లా పెట్టుకోము. మాకంత తాగుడలవాటులేదు అనే ధోరణిలో అంది.

దానికి శంకరరావు "మేముకూడా కొని ఇంట్లో వుంచం. తాగేస్తాం" అన్నాడు నవ్వుతూ!

"మేమూ అంతే" అన్నాడు కృష్ణ రెండో రౌండ్‌కి గ్లాసందిస్తూ.

"ఎల్లా వుంది? మీ కోర్సు వర్కు?" అని అడిగింది షీల.

"కోర్సులో బాగానే గ్రేడ్స్ వస్తున్నాయి. కాని టీచింగ్ ప్రాక్టీస్‌లోనే నాకు మా సూపర్‌వైజర్‌కి పడటంలేదు. రోజు 'ఇల్లా చెప్పు అల్లాకాదు' అంటూ మాటలనిస్తూ వుంటాడు. నాకు వళ్ళు మండిపోతుంది" అంది పార్వతి.

"మీ టాయిలెట్ యూజ్‌చెయొచ్చా?" అని కృష్ణ అడిగాడు. శంకరరావు "షూర్" అంటూ దారితీసాడు. మగవాళ్లిద్దరు దూరం అవగానే షీల గొంతు తగ్గించి,

"మా సూపర్‌వైజర్‌తో ఏ గొడవరాకుండా వుండాలంటే కొంచెం అతని కళ్లకి అందంగా కనపడటం నేర్చుకోవాలి. వీళ్ళు నల్లటి ఆడవాళ్లంటే పడిచస్తారు. కాని ఇండియన్స్ కన్‌సర్వేటివ్స్ అని కాంప్లిమెంట్స్ ఇవ్వటానికి జడుస్తారు. మనం ఆ భావం పోగొట్టేలా వాళ్లతో కాస్త సోషల్‌గా వుంటే వాళ్ళు రోజు ఓ కాంప్లిమెంటిస్తూ వుంటారు. అల్లా ఇవ్వటం మొదలుపెట్టాక టీచింగ్ ప్రాక్టీస్‌లో ఫెయిల్ చెయ్యడానికి మొహమాటపడ్తారు. నేను పంజాబీ డ్రెస్ వేసుకువెళ్లినరోజున మా మాక్స్ నీకు చాలా మంచి కర్వ్స్ వున్నాయనికూడా అన్నాడు. మనం అప్పుడు సిగ్గుపడకుండా థాంక్స్ అనడం నేర్చుకోవాలి" అని బోధించింది.



# ఆకర్షణ - వ్యామోహం

ఆ రాత్రి వాళ్లు వెళ్లాక, పార్వతి షీల అన్నదాన్ని బాగా సెన్సార్‌చేసి వాళ్ల మాక్స్ సుశీల కర్వ్స్‌ని పొగిడాడుట అంది. ఆరోజు పార్వతిని దగ్గరకు తీసుకొంటూ తాగిన మత్తులో శంకరరావు షీల కర్వ్స్ గురించిన ఆలోచనలలో తలమునకలయ్యాడు.

## 9

స్ప్రింగ్ తిరిగి వచ్చింది. వినాయకచవితి వచ్చింది. ఈసారి శంకరరావు వినాయకచవితి గురించి బాధపడలేదు. పార్వతి శంకరరావు తొందరగా లేచి కబ్బర్డ్‌లో దాచిన దేవుడి బొమ్మలకి నమస్కారం పెట్టుకొన్నారు. ఆ రోజు పార్వతికి టీచింగ్ ప్రాక్టీస్ ఉంది. శంకరరావుకి ముఖ్యమైన ఎక్స్‌పెరిమెంటుంది. మానడానికి లేదు. వ్రత ప్రసక్తి పెట్టుకోలేదు.

వినాయకచవితి వెళ్లిన కొద్ది రోజులకి ఇయాన్‌స్మిత్, బెట్టీస్మిత్ వచ్చి ఆ శనివారం రాత్రి వాళ్లింటికి భోజనానికి రమ్మని పిలిచారు. పార్వతి మొదట్లో శనివారం రాత్రి భోంచెయ్యనంటూ ఉండేది కాని పిలిచేవాళ్లందరు మర్నాడు ఆదివారం అయ్యేలాగా, ఆలస్యంగా పడుకొన్నా ఇబ్బందిలేని విధంగా శనివారం రాత్రిళ్లే భోజనానికి పిలవటంతో, తను పెట్టుకొన్న నియమం శనివారం ఏకభుక్తం ఉంటానని కదా, పొద్దున్న భోజనం మానేసి రాత్రి తిన్నా అది ఏకభుక్తమే ఔతుంది కదా అని సమాధాన పెట్టేసుకొంది. శనివారం పొద్దున భోంచెయ్యదు. సోమవారం నుంచి శుక్రవారం వరకు ఎల్లాగో లంచికి రెండు బ్రెడ్ ముక్కలే తింటారు తామిద్దరు. శనివారం కూడా తినకపోతే పెద్ద ఇబ్బందేం లేదు. ఏకాదశి పొద్దుండేవాళ్లు ద్వాదశి పొద్దున్నే లాగించినట్టు ఆదివారం పొద్దున్న వారానికి సరిపడేలా భోంచేస్తే సరిపోతుంది కదా అని ఆలోచించి శనివారం పొద్దున్న శంకరరావుకి బాబుకి తేలిగ్గా వంట చేస్తుంది. ఆ పూట యిద్దరూ షాపింగ్‌కి వెళ్లి వస్తువులు తెచ్చుకొంటారు.

స్మిత్‌లకి ఇండియన్స్‌తో బాగా పరిచయం. అందుకని బాబుని తప్పకుండా తీసుకురమ్మని బేబీ సిట్టర్ దగ్గర వదలాల్సిన పని లేదని చెప్పారు. ఆరు గంటలకల్లా బాబుకి అన్నం పెట్టి ఏడు గంటలకల్లా స్మిత్‌ల ఇంటికి జేరుకొన్నారు శంకరరావు పార్వతీను. ఏ తొమ్మిదింటికో బాబుకి సప్పర్‌కి ఏమైనా ఇస్తే తిని నిద్రపోతాడు. ఈ లోపల కాస్సేపాడుకొంటాడు, ఇబ్బంది ఏం లేదు అనుకొన్నారు.

రంగస్వామి, లక్ష్మి, వనజ కూడా కాస్సేపటికి వచ్చారు. రంగస్వామి వస్తూనే "అంతా వచ్చినట్టేనా?" అని అడిగాడు.

"లేదు. సంజయ్, మరియన్‌లు రావాలి. బెలాన్ నుంచి రావాలేమో కొంచెం ఆలస్యం అవవచ్చు" అన్నాడు ఇయాన్.

"అంతవరకు డ్రింక్స్ తీసుకొంటూ కూర్చుందురుగాని" అంది బెట్టి. ఇయాన్ లోపలికి వెళ్లాడు డ్రింక్స్ కలపటానికి. బాబ్, వనజ ఒక మూల సర్దుకున్నారు. ఆడవాళ్ళు విడిగా మాట్లాడుకొంటున్నారు.

"సంజయ్ ఎవరు?" అంటూ శంకరరావు రంగస్వామిని అడిగాడు.

"సంజయ్ అన్న ఆయన ఓ డాక్టరు. కొంచెం కుర్రడాక్టరు. పెళ్లి కాలేదు మరియన్ అతని గర్ల్ ఫ్రెండ్. ఇక్కడ ఎవరినైనా పార్టీకి పిలిస్తే గర్ల్ ఫ్రెండ్‌ని కూడా తీసుకువస్తారు."

"అంటే మరియన్ సంజయ్‌కి ఫియాన్సీయా?"

"అదేం లేదు. సంజయ్ కొంచెం ఉత్సాహవంతుడు. ఆస్ట్రేలియా వచ్చినప్పటి నుంచి తనతో తిరగటాని కిష్టపడే తెల్లతోలు అమ్మాయికోసం గాలించి సంపాదించాడు ఈ స్నేహితురాల్ని."

"ఆ అమ్మాయికి ఆస్ట్రేలియన్ ఎవరూ దొరకలేదుకాబోలు!"

"కాదు. ఆమెకి ఇండియా అన్నా, ఇండియన్లన్నా చాలా ఇష్టం ఇయానువాళ్లకిలాగా. సంజయ్ ప్రపోజ్ చేస్తే మరియన్ అతన్ని చేసుకొనే ఉద్దేశంతో వున్నట్టే అనిపిస్తుంది."

"మరింకేం! మరియన్‌ని చేసుకొంటే పోలా!"

"సంజయ్ చేసుకోడు."

"ఎందుకని?"

"తను మరియన్‌కి జీవితంలో తారసపడ్డ ఒకే ఒక మగవాడు కాదు కనుక. అంతకుముందు మరో యిద్దరితో తిరిగింది కనక. కేవలం మరియన్‌తో స్నేహమేట. అంతకుమించి దేనికి దారితియ్యనియ్యడుట."

"పోన్లెండి ఆమాత్రం మోరల్స్ వుంటే మెచ్చుకోతగ్గ విషయమే."

"దేనికీ దారితియ్యడానికి అంటే పెళ్లికని అర్థం. మరియన్‌కి అతనికి ఇంటిమసీ వుంది. అతనే చెప్పాడు. వీకెండ్స్ కలిసే స్పెండ్ చేస్తారు. తనకి ఆ పిల్లని చేసుకొనే ఉద్దేశంలేదని మాత్రం మరియన్‌కి తెలియనియ్యడు. చాలా తెలివైనవాడు. ఈ ముచ్చట్లు తీరాక ఎప్పుడో ఇండియా వెళ్లి కట్నంతోసహా ఒక ముగ్ధకన్యను పెళ్లి చేసుకొని వస్తాడు. మన దేశంలో విదేశాల్లో వున్న పెళ్లికొడుకులకి గొప్ప గిరాకీ!"

"నిజమే పెళ్లికూతురు మొగుడితో విమానంలో ఎగరటం గురించి కలలు కంటుందే తప్పించి, అతనిక్కడ ఎల్లాంటి జీవితం గడిపుండవచ్చునన్న విషయం గురించి ఊహించదు."

ఇంతలో ఇయాన్ డ్రింక్స్ తీసుకువచ్చాడు. పార్వతి, లక్ష్మి ఉండటంచేత తటపటాయించినా, షీలలాగా బిహేవ్ చెయ్యడం ఇష్టంలేక షెర్రీ తీసుకొంది వెంటనే వనజ,

"పార్వతి చాలా మారిపోయిందోవ్! అన్నట్టు అమ్మా! నువ్వు ఇన్ని సంవత్సరాలైనా మారలేదు. పార్వతిని చూసైనా నేర్చుకో" అంది ఉత్సాహంగా.

లక్ష్మి "నోర్మూస్కో" అంటూ కసిరింది. కాస్సేపటికి మళ్లీ అందరు నెమ్మదిగా మాట్లాడుకోడం మొదలుపెట్టారు. మగవాళ్లు ఫుట్‌బాల్

మాచెస్ గురించి మాట్లాడుకోడం మొదలు పెట్టారు.

"మీరు వనజని బాగానే అదుపులో పెడ్తారు" అంది పార్వతి నవ్వుతూ. ఆ పిల్లని అదుపు చెయ్యాల్సిన అవసరం ఈమధ్య పార్వతికి ఎక్కువగా కనిపిస్తోంది!

"ఏం అదుపో!" అంది లక్ష్మి.

"నీకో విషయం చెప్పాలనుకొంటున్నాను లక్కీ! చెప్పనా?" అంది బెట్టీ.

"చెప్పు" అంది లక్ష్మి.

"ఓసారి వంటింట్లోకి రా చెప్తాను. నువ్వు రా పార్వూ!" అంది బెట్టీ. వంటింట్లోకి వెళ్లాక "మీరు, ఇండియన్లు. చాలా కన్సర్వేటివ్స్. అందుకని చెప్పటానికి భయపడుతున్నాను. కాని మీరున్న దేశం ఆస్ట్రేలియా. ఇక్కడ ఇక్కడలాగానే ఉంటే బావుంటుంది. ఏమంటారు?"

"చీర మానేసి ఫ్రాకులు వేసుకోమంటావా?" అని కోపంగా అడిగింది పార్వతి.

[ఇంకా వుంది]



## తొర్రేడు గ్రామంలో "ప్రెసిడెంట్ పేరమ్మ"

ప్రకృతి రామణీయకతతో తెలుగుదనం ఉట్టిపడే గ్రామాలెన్నో ఉన్నా – తొర్రేడు గ్రామం "ప్రెసిడెంట్ పేరమ్మ" వర్ణచిత్రంలోని సన్నివేశాల చిత్రీకరణకు అనువుగా ఉండడం ఓ విశేషం. రాజమండ్రికి ఐదు మీటర్ల దూరంలో ఉందా గ్రామం. అక్కడొక భవంతిని చూపిస్తూ, "ఈ మన్యం వారి బంగళాలోనే అక్టోబర్ 16న షూటింగ్ ప్రారంభించాం. ఈ కుటుంబ పెద్దలు, ఈ తొర్రేడు గ్రామస్థులు ఎంతగానో సహకరించారు. అందుకే అనుకున్న వ్యవధిలో ఇక్కడి షూటింగ్ షెడ్యూల్‌ను పూర్తిచేయగలిగాం" అన్నారు కవితా ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత శ్రీ డి వి. ఎస్. రాజు కృతజ్ఞతాపూర్వకంగా.

ప్రదర్శింపబడిన పలుచోట్ల ప్రశంసలందుకున్న దాసం గోపాలకృష్ణ విరచిత నాటకం ఆధారంగా తయారవుతున్న ఈ చిత్రం రాజకీయాలమీద చక్కని సెటైర్. మంచి కామెడీ. అన్ని తరగతుల ప్రేక్షకులనూ ఆకర్షించే నూతనత్వం గల ఇతివృత్తం. ఇటువంటి సబ్జెక్ట్ చేపట్టితే డైరెక్టర్ కె. విశ్వనాథ్ ఎంతగా విజృంభిస్తారో అందరికీ తెలుసు. మొదటి షెడ్యూల్‌లో రెండు పాటలు చిత్రీకరించినట్లు తెలియజేశారాయన. "ఎందుకంత తొందర" అనే సి. నారాయణరెడ్డి రాసిన జావళికి మంజుభార్గవి నృత్యం ఒకటి. ఇందులో గోకిన రామారావు, సారధి కూడా పాల్గొన్నారు. రెండొవది "తెల్లారి కలగన్న" అనే వేటూరి సుందరరామమూర్తి గీతం – నూతన్‌ప్రసాద్, కవిత మీద చిత్రీకరింపబడింది. ఈ షెడ్యూల్ కోసం తొర్రేడులో ప్రత్యేకంగా ఒక సెట్ వేశారు కూడా – శిల్ప దర్శకుడు మూరపనేని కళాధర్

తక్కువ వ్యవధిలో ఈ చిత్రాన్ని పూర్తి చేయడానికి అనువుగా కాల్‌షీట్లు అడ్జస్ట్ చేయగల నటీనటులనే బుక్ చేయడం జరిగిందని తెలియజేశారు నిర్మాత అంచేత, ఎప్పుడూ అగ్రశ్రేణి తారలతో చిత్రాలు తీసే మీరు ఈ మారు నూతన్‌ప్రసాద్ లాంటి నూతన హీరోను ఎన్నుకోవడానికి కారణ మేమిటని అడగవలసిన అవసరం లేకపోయింది.

నటీనటులు, సాంకేతిక నిపుణులు, యూనిట్‌లోని అందరికీ చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా రాయల్ ట్రీట్‌మెంట్ ఇచ్చే చిత్ర నిర్మాణ సంస్థల గురించి ముచ్చటించేటప్పుడు ముందుగా డి. వి. ఎస్. రాజుగారి సంస్థల గురించి అందరూ పేర్కొనడం మామూలు. అది ప్రత్యక్షంగా చూసే అవకాశం కలిగింది ఇటీవల కొందరు పాత్రికేయులకు.



'ప్రెసిడెంట్ పేరమ్మ'లో కవిత

# జి. వి. జి. పేజీ

## ఎంకి నాయుడుబావలో నాగులు బుసబుసలు

ఒంటరిగా వస్తున్న ఎంకిని నాగులు పట్టుకొని బలవంతం చేయబోయాడు. ఆమె పెనుగులాడుతూ, "నాయుడూ!" అని కేకెట్టింది. కొంతదూరంలో పొలంలో పని చేస్తున్న నాయుడు పరుగున వచ్చి, నాగుల్ని చితకతన్నాడు. నాగులు కాలికి బుద్ధిచెప్పక తప్పలేదు.

పారిపోతున్న నాగుల్ని రామయ్య పట్టుకుని, "ఒరేయ్! దొంగనాయాలా! ఏం చేశావురా?" అని అడిగాడు.

"చేసింది నేను కాదు, తాతా! నాక్కాబోయే పెళ్ళాన్ని నాయుడు పట్టుకుంటే, నే కాపాడాను," అన్నాడు నాగులు.

ఇంతలో ఎంకితో అక్కడికొచ్చిన నాయుడు "కథ అడ్డంతిప్పాడ్లే, రామయ్యా... ఏరా, నాగులూ! ఇంకా పరిపోలేదా?" అన్నాడు.



'ఎంకి–నాయుడు బావ'లో వాణిశ్రీ

"అదికాదు, తాతా..." అంటూ నాగులు (మాదాల రంగారావు) ఏదో చెప్పబోయాడు.

"ఛీ! నోర్మూయ్ కుక్కా! మరోసారి నా తల్లిని ఏమన్నా అన్నావో – నిన్ను చంపి తవ్వి పాతేస్తా," అన్నాడు రామయ్య (గుమ్మడి).

శోభన్‌బాబు, వాణిశ్రీలతో వెంకటేశ్ ఎంటర్‌ప్రైసెస్ పతాకంలో డి. రామానాయుడు సమర్పించే "ఎంకి – నాయుడుబావ" స్కోప్ కలర్ చిత్రంలో ప్రభాకరరెడ్డి, చంద్రమోహన్, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, మిక్కిలినేని, అర్జా జనార్ధనరావు, జానకి, చంద్రకళ, రాజసులోచన, జయమాలిని ఇతర తారాగణం. డి. వెంకటేశ్‌బాబు నిర్మాత. బోయిన సుబ్బారావు దర్శకుడు. మహదేవన్ సంగీత దర్శకుడు. సుందరం ఛాయాగ్రాహకుడు. బి. ఎల్. వి. ప్రసాద్ సహకార దర్శకుడు. పినిశెట్టి రాసిన కథకు ఆయనతోపాటు మోదుకూరి జాన్సన్ సంభాషణలు రాశారు.

## రిజిష్టర్ చేయబడిన కొత్త చిత్రాల పేర్లు

ఎన్. వై. కె. కంబైన్స్ "అపరిచిత", శ్రీ వాణీ వరలక్ష్మి కంబైన్స్ "గెలుపు మాదే", విజయకళ ఆర్ట్స "గురు", సరోజ చిత్ర ప్రొడక్షన్స్ "హతీవ్ తాయ్", విష్ణుప్రియా ఆర్ట్ పిక్చర్స్ "దేవుడెక్కడున్నాడు ?", సుప్రభాత ఆర్ట్ ప్రొడక్షన్స్ "రారా కృష్ణయ్యా", రాధాకృష్ణా కంబైన్స్ "మంచి మాస్టారు", తారకప్రభు ఫిలిమ్స "డిటెక్టివ్ యుగంధర్",



'వజ్రాలవేట'లో హలం, అనంతనాగ్

శ్రీ లక్ష్మీనరసింహా ఇంటర్నేషనల్ "పాలు–నీళ్లు", విఠల్ ప్రొడక్షన్స్ "గాంధర్వ కన్య", కల్యాణ చిత్ర "అందాల బొమ్మ", శ్రీకృష్ణదేవరాయ ఆర్ట్ పిక్చర్స్ "అభాగ్యురాలు", బి. వి. పిక్చర్స్ "ఆమె అలాగే", చైతన్య జ్యోతి మూవీస్ "అరుణోదయం", ప్రభు ఆర్ట్ ఫిలిమ్స "న్యాయము – చట్టము", శ్రీకృష్ణదేవరాయ ఆర్ట్ పిక్చర్స్ "నేను ఎందుకు పుట్టాను ?", జయకృష్ణ ఇంటర్నేషనల్ "ప్రేమపుష్పాలు", సుధీర్ ప్రొడక్షన్స్ "శోభనరాత్రి", సూర్యకృష్ణ మూవీస్ "విడాకులు", శ్రీ లక్ష్మి ఎంటర్‌ప్రైసెస్ సినీ యూనిట్ "ఉగాది బుల్లోడు – సంక్రాంతి బుల్లెమ్మ", శివజ్యోతి ఎంటర్‌ప్రైసెస్ "కలకాదుసుమా", నాగరత్నా ఆర్ట్ పిక్చర్స్ "పరాజిత."



'ఊర్వశీ నా ప్రేయసి'లో లత, సుభాషిణి

## డైరెక్టర్ శ్రీధర్ కొత్త చిత్రం

శ్రీ సంజయ్‌చిత్ర పతాకంలో చంద్రమోహన్, శ్రీదేవి నాయకా నాయికలుగా వై. కన్నయ్య నిర్మించే చిత్రం హైదరాబాద్ పరిసర ప్రాంతాలలో గ్రామీణ వాతావరణంలో తయారౌతోంది. వేటూరి గీతాలకు ఇళయరాజా బాణీలు కూర్చారు. తివారీ ఛాయాగ్రాహకుడు.

శ్రీధర్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారౌతూన్న మరో చిత్రం భరణీచిత్ర ఎంటర్‌ప్రైసెస్ వారిది. దీనికి "ఊర్వశీ నా ప్రేయసి" అని పేరు పెట్టారు. మురళీమోహన్, శరత్‌బాబు, నాగేష్, గోకిన రామారావు, లత, సుభాషిణి, కొత్త నటుడు ప్రకాష్ పాత్రధారులు. వసంత కుమార్ సంభాషణల కర్త. ఇళయరాజా సంగీత దర్శకత్వంలో వేటూరి గీతాలు రాశారు. బి. భరణీ రెడ్డి నిర్మాత.

## తండ్రి అడుగుజాడల్లో...

సునీల్‌దత్ తనకన్నా వయసులో రెండేళ్లు పెద్ద అయిన నర్గీస్‌ను వివాహమాడితే, వాళ్ళ కొడుకు సంజయ్ అతనికన్నా పెద్ద అయిన టినా మునీమ్ ప్రేమలో పడ్డాడు.

# జి. వి. జి. పేజీ

## తొలిసారిగా...

తొలిసారిగా బొగ్గుగనుల ప్రాంతంలో చిత్రీకరణ జరిగే తెలుగు చిత్రం కొమ్మినేని శేషగిరిరావు దర్శకత్వంలో కె. రామచంద్రరావు రంగుల్లో నిర్మించే హేమా ఆర్ట్ ఫిలిమ్స్ "చేయెత్తి జైకొట్టు." కృష్ణంరాజు, మోహన్ బాబు, నూతన్‌ప్రసాద్, త్యాగరాజు, సారథి, గీత వగైరా నటవర్గం. సత్యానంద్ సంభాషణలకర్త. జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు. డిసెంబర్, జనవరి, ఫిబ్రవరి నెలల్లో షూటింగ్ జరుగుతుంది.

విఖ్యాత మలయాళ దర్శకుడు రాముకారియత్ దర్శకత్వం నెఱపుతూన్న మొదటి తెలుగు చిత్రం "కొండగాలి". అదే పేరున భూషణం రాసిన నవలను వై. జె. క్రియేషన్స్ పతాకంలో వై. జె. రెడ్డి 'టాడ్ఏఓ–స్కోప్ కలర్'లో నిర్మిస్తున్నారు. శ్రీశ్రీ గీతాలకు సలీల్‌చౌదరి స్వరకల్పన చేశారు. కూర్పు: ఎం. ఎస్. మణి. నిర్వహణ: జి. గోపాలరావు.

ప్రొడక్షన్ ఎక్జిక్యూటివ్‌గా పలు చిత్రాలకు సామర్థ్యంతో పని చేసిన ఎస్. పి. వెంకన్నబాబు (సంగీత దర్శకుడు స్వర్గీయ కోదండపాణి తమ్ముడు) తొలిసారిగా ఒక చిత్రాన్ని శ్రీ ఉదయ్ ఆర్ట్ పిక్చర్స్ పతాకంలో నిర్మించబోతున్నారు. స్కోప్ కలర్‌లో తయారయ్యే ఈ చిత్రానికి ఎస్. పి. రాజారావు దర్శకుడు, జంధ్యాల రచయిత.

తమిళ దర్శక నిర్మాత, కథకుడు టి. ఎస్. బాలు తెలుగులో ఓంప్రథమంగా "శంకర్‌లాల్" అనే చిత్రాన్ని బాబు సినీ ఆర్ట్స్ బేనర్‌లో తయారు చేస్తున్నారు. శ్రీపతి దత్తాత్రేయశర్మ సంభాషణలకర్త. ఎస్. కె. విశ్వనాథ్ ఛాయాగ్రాహకుడు. రాంకుమార్ శిల్ప దర్శకుడు. రాయప్రోలు గోపి సహకార దర్శకుడు. సంగీత కళాశాలలో మూడుసార్లు డిప్లొమా పొంది, విదేశీయ సంగీతంతో గ్రంథాల ద్వారా పరిచయం ఏర్పరచుకొని, పెక్కు వాద్యాలు వాయించగల నిపుణుడు ఇళయరాజా ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. తమిళంలో కూడా తయారౌతున్న ఈ చిత్రంలో శ్రీదేవితోపాటు కమలహాసన్, సీమ నటిస్తున్నారు. ఎ. వి. ఎం. స్టూడియోలో అక్టోబర్ 21న ఈ చిత్రానికి ప్రారంభోత్సవం జరిగినప్పుడు కమలహాసన్ "మా అన్నయ్య చంద్రహాసన్ అడ్వకేటు. ఆయన కూతురు సుహాసిని క్వీన్ మేరీస్ కాలేజ్‌లో చదువుతూన్నదల్లా హఠాత్తుగా ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరి, సినిమాటోగ్రఫీలో శిక్షణ పొందనారంభించింది. త్వరలోనే ఆమె కెమెరా ముందు కూడా నువ్వు నిలుచోవాల్సివస్తుంది," అంటే, సీమ "ఎంత పెద్ద తారనైనా నేనే మాత్రం గర్వంతో ప్రవర్తించను. నేను డాన్స్ మాస్టరుకి అసిస్టెంట్‌గా వున్న రోజుల్లో – సెట్‌లో కొందరు తారలు దర్పం ప్రదర్శించడం చూసి లైట్ బాయ్‌లు ఎంతగా చీదరించుకునేవారో నా చెవులారా విన్నాను. నన్నలా విమర్శించడానికి ఎవరికీ అవకాశ మివ్వను," అంది.



'కోరికలే గుర్రాలైతే'లో
జయలక్ష్మి, చంద్రమోహన్

ఈ చిత్ర దర్శక నిర్మాత టి. ఎస్. బాలు తమిళనాడులో కఠినతరం చేయబడ్డ మద్యపాన నిషేధ చట్టరీత్యా అక్టోబర్ 20న అరెస్టయ్యాక జామీనుమీద విడుదలై, మర్నాడు ఉదయం ఈ చిత్రం ప్రారంభోత్సవానికి హాజరయ్యారు. ఆ సాయంత్రం సూపర్‌హిట్ అయిన ఆయన తమిళ చిత్రం "చట్టం ఎన్ కైయిల్" శతదినోత్సవానికి అధ్యక్షత వహించిన తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి డాక్టర్ కరుణానిధి ఒకప్పుడు "చట్టం ఎన్ కైయిల్" అంటే "చట్టం తన చేతుల్లో ఉండే"దని చమత్కరించారు.

## మద్రాసులో మళ్ళీ చిత్ర నిర్మాణాల జోరు

పలు భాషా చిత్ర నిర్మాణ కేంద్రంగా మద్రాసుకు పూర్వపు స్థానం మళ్ళీ చేకూరుతోంది. తెలుగు, తమిళ, మలయాళ, కన్నడ, ఒరియా భాషా చిత్రాల పాటల రికార్డింగ్‌లు, షూటింగ్‌లు మునుపటిలాగే ముమ్మరంగా సాగుతున్నాయి. మద్రాసులో చిత్ర నిర్మాణం లాభదాయకం కాదనుకొని పొరుగు రాష్ట్రాలకు వెళ్లిన నిర్మాతలు చాలామంది తిరిగి మద్రాసుకే చేరుకుంటున్నారు. మన రాష్ట్రంలో తయారయ్యే కొత్త చిత్రాల పాటల రికార్డింగ్ ప్రారంభోత్సవాలు మద్రాసులోనే జరగడం మామూలే కదా? ✪

# మళ్ళీ మీ రోజువారీ పనులు మామూలుగా చేసుకోవాలని ఆత్రుతగా ఉందా మీకు?

# గ్లాక్సోస్-డి®

అలసటను ఎదుర్కొనేందుకు

వెంటనే శక్తిని సమకూరుస్తుంది.

గ్లాక్సోస్-డి తో మీరు మామూలుగా మీ ఇంటి పనులు చేసుకునేందుకు సిద్ధం కావచ్చు. గ్లాక్సోస్-డి మీ శరీరానికి కావలసిన ముఖ్యమైన శక్తిని అందజేస్తుంది. డాక్టర్లచే సిఫారసు చేయబడుతున్న గ్లాక్సోస్-డి, విటమిన్ డి, కాల్షియం, ఫాస్ఫరంతో బలపరచబడిన హైగ్రేడ్ గ్లూకోజ్.

గ్లాక్సోస్-డి అలసటను దూరం చేసి మళ్ళీ మీరు ఇంటి పనులు మామూలుగా చేసుకొనేందుకు కావలసిన శక్తిని సమకూరుస్తుంది.

**గ్లాక్సోస్-డి®**

**కుటుంబానికంతటికీ ఇట్టే శక్తినిచ్చేందుకు.**



dCA/GL/54 TEL

# సినిమా



'రావణుడే రాముడైతే'లో ఒక దృశ్యం.

## ప్రేమపూజారిగా చంద్రమోహన్!

టి నగర్, త్యాగరాయ రోడ్‌లో వుంటున్న ఇంట్లోంచి, కోడంబాకం దగ్గర స్వంతంగా కట్టుకున్న కొత్త ఇంటికి మారారు యిటీవలె చంద్రమోహన్. అంటే వడపళనిలో వుంటున్న స్టుడియోలకు కొంత దగ్గరయ్యాడని చెప్పొచ్చు. కొత్తింటి జోరుకదా. కొత్తమ్మాయి వలపులో పడ్డాడు. మద్రాసులో అయితే వాళ్ళు, వీళ్ళు చూస్తారని యిద్దరూ తిరుపతి కెళ్ళారు. ఆ సప్తగిరివాసుని సమక్షంలో పాడుకున్నారు, సరదాగా ఆడుకున్నారు. మరి యింత తతంగం జరుగుతూంటే వాళ్ళావిడ వూరుకుంటుందా? ఊరుకోక ఏం చేస్తుంది పాపం! ''మావారి ఈ ప్రేమ నిజంకాదుగా.సినిమాకోసం'' అంటుంది ఏమైనా అడిగితే ఆమె నమ్మకమే నిజం. చంద్రమోహన్ వలలోపడ్డ ఆ కొత్తమ్మాయి పేరు జయలక్ష్మి. వారి ఈ ప్రేమ పాట, వలపుబాట శ్రీ లలితా ఎంటర్‌ప్రైజస్ వారి ''కోరికలే గుర్రాలయితే?'' వర్ణ చిత్రానికి సంబంధించినదే.

ప్రజాదర్శకుడు శ్రీ దాసరి నారాయణరావు స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం సమకూరుస్తున్న ఈ చిత్రానికి శ్రీ జగదీష్‌చంద్రప్రసాద్ నిర్మాత. మురళీమోహన్, ప్రభ మరొక ముఖ్య జంటగా నటిస్తున్న ఈ చిత్రంలో ''రేరేరేక్కాయలో, ఆరేరేరేక్కాయలో'' అనే జయమాలిని నృత్యం మరో ప్రత్యేక ఆకర్షణ.

కళాసాగర్ షీల్డ్ అవార్డుల ప్రదానోత్సవంలో డా. భానుమతివద్ద అవార్డు అందుకుంటున్న గాయని ఎస్. జానకి



## భారీ చిత్రాలు వద్దు, బడ్జెట్ చిత్రాలు చాలు

''భారీ చిత్రనిర్మాణం తలపెట్టే వుద్దేశ్యం లేదండి. బడ్జెట్ సినిమాలు తీయాలనే నిర్ణయించుకున్నాను. లక్షలకొద్దీ డబ్బు ఖర్చుపెట్టి తీసి, తీరా బాక్సాఫీస్ దగ్గర అది దెబ్బతింటే నిర్మాత గతేమిటి? ఇప్పుడు విడుదలౌతున్న చిత్రాలను, వాటి రన్‌ను చూస్తుంటే భయమేస్తోంది. చక్కటి కథతో చిన్న చిత్రాన్ని తీసుకుంటే చాలనిపిస్తుంది. పోతే రెండో, మూడో పోతుంది.'' (లక్షలు) అన్నారు ''రిక్షా రాజీ'' చిత్ర నిర్మాత శ్రీ జి. వి. యస్. రాజు మీ తదుపరి చిత్రం పెద్ద హీరోలతోనా అని అడిగితే.

ప్రస్తుతం ప్రముఖ నిర్మాత శ్రీ డి. వి. ఎస్. రాజు కూడా ''ప్రెసిడెంట్ పేరమ్మ'' అనే బడ్జెట్ చిత్రాన్నే నిర్మిస్తున్నారు. ఇలా ప్రముఖ నిర్మాతలందరూ భారీ వర్ణ చిత్రాలు తీయడం ఒక్కసారిగా మానుకుంటే హీరోల పరిస్థితి ఏమౌతుందో! ''ఏమీకాదు. ఎందుకంటే భారీ చిత్ర నిర్మాణం కొనసాగుతూనేవుంటుంది కనుక. పాత నిర్మాతలు మానుకుంటే కొత్త నిర్మాతలు వస్తారు. చిత్రాలు తీస్తారు అంటుంది'' ఒక వర్గం. అది కూడా నిజమే.

## ప్రియబాంధవి ప్రోగ్రెస్

రంగనాథ్, శారద జంటగా నటిస్తున్న కృష్ణచిత్ర వారి ''ప్రియబాంధవి'' వర్ణచిత్రం నెక్స్ట్ షెడ్యూల్‌కు వురకలువేస్తోంది. అక్టోబర్ ఆఖరివారంనుంచి నవంబర్ మొదటివారంవరకూ, గూడూరు, నరసింహకొండప్రాంతాల్లో షూటింగ్ పూర్తిచేసుకువచ్చిన కృష్ణచిత్రయూనిట్ డిశంబర్ మొదటివారంలో శ్రీశైలం వెళ్ళడానికి వలసిన ఏర్పాట్లను గమనించడంలో నిమగ్నమైవుంది.

''ఫస్టుషెడ్యూల్ కామ్‌గా జరిగింది. ఒకటి, రెండురోజులు కొంత ఇబ్బంది కలిగినా సాఫీగా జరిగిపోయింది. ఉయ్ ఆర్ హాపీ. సెకండ్ షెడ్యూల్ కూడా ఇలాగే జరిగితే ఉయ్ విల్ బి మోర్‌హాపీ'' అన్నారు చిత్ర కథకుడు, దర్శకుడు శ్రీ పద్మనాభరావు.

పంతులమ్మగా శారద, డాక్టర్‌గా రంగనాథ్ నటిస్తున్న ఈ రంగులచిత్రానికి శ్రీ కులగుంట్ల శ్రీపతిరావు సోదరులు నిర్మాతలు. శ్రీ శ్రీ మాటలతో, పెండ్యాల బాణీలతో, గోపాలరెడ్డి కెమెరాతో, వరదారెడ్డి శిల్పంతో చిన్ని, సంపత్ నృత్యంతో కొత్త పుంతలు త్రొక్కుతూంది ''ప్రియబాంధవి.''

## మోహన్‌బాబు హీరోగా యస్. డి. లాల్ కొత్త చిత్రం

వెరైటీ విలన్‌గా విశేషప్రజాదరణ పొందిన మోహన్‌బాబు ఒక తమిళ చిత్రంలో హీరోగా నటించడానికి అంగీకరించి చాలారోజులైషూటింగ్ కూడా జరుగుతూవుంది. మరి తెలుగులో ఎప్పుడు హీరోవేషం వేస్తారు? అని వారి అభిమానులు వుత్తరాలు వ్రాస్తూనేవున్నారు. వారందరికీ శుభవార్త. యస్.డి. లాల్ దర్శకత్వంలో ఆర్.డబ్ల్యు మూవీస్ నిర్మిస్తున్న వెరైటీక్రైమ్ చిత్రంలో మోహన్‌బాబు హీరో పాత్రకు ఎన్నికయ్యారు. వారికి జంటగా ''శివరంజని'' ఫేం సుభాషిణి నటిస్తూంది. ఈనెలే చిత్రం షూటింగ్ ప్రారంభమైంది. వచ్చేనెలకు పూర్తవుతుంది.

## "గంధర్వ కన్య"

''జగన్మోహిని'' చిత్రంతో శ్రీ విఠలాచార్య మళ్ళీ తన జాతక ప్రభావాన్ని ''ప్రూవ్'' చేశారు. జానపద చిత్రాలను జనరంజకంగా చెప్పగల నేర్పు తనకు మాత్రమే తెలుసు అని ''జగన్మోహిని'' చిత్రీకరణ ద్వారా నిరూపించిన శ్రీ విఠలాచార్య ... మరో ''కాశీమజిలీ కథ''ను వర్ణచిత్రంగా తలపెట్టి... ఆ చిత్రానికి ''గంధర్వ కన్య'' అని నామకరణం చేశారు.

''జగన్మోహిని'' చిత్రం విడుదలయిన తరువాత ... ఆరేడు బయటి చిత్రాల ఆఫర్లను శ్రీ ఆచార్య వలదన్నారు.

## దర్శకుడి చిత్రంలో దర్శకులు

ఒక ప్రముఖ దర్శకుడి చిత్రంలో యిద్దరు ప్రముఖ దర్శకులు ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు. ఆ ప్రముఖ దర్శకుడి పేరు శ్రీ యు విశ్వేశ్వరరావు. ఈ ప్రముఖ దర్శకుల పేర్లు శ్రీ పి పుల్లయ్య, శ్రీ కె బి తిలక్ నవంబర్ 6 వ తేదీ శ్రీ సారథీ స్టుడియోస్‌లో ప్రారంభించిన తన "నగ్నసత్యం" చిత్రంలో పై దర్శకులిద్దర్నీ తెరపై చూపించడానికి ప్రయత్నిస్తున్న విశ్వేశ్వరరావుగారి అభిరుచిని అభినందించడం అవసరం "తీర్పు", "మార్పు" వంటి ప్రయోగాత్మక చిత్రాలను నిర్మించి, వ్యాపార ధోరణికి పూర్తిగా స్వస్తిచెప్పి, సమాజాభ్యుదయ వాదాన్ని ప్రబోధించే చిత్రాలనే వారు ఎన్నుకుంటున్నారనడానికి "నగ్నసత్యం" చిత్రం మరో నిదర్శనం. పవిత్రమైన స్త్రీ స్థానాన్ని అపవిత్రం చేస్తున్న దుష్టశక్తుల నిజస్వరూపాలను బట్టబయలు చేసే కధాంశమే "నగ్నసత్యం"

## మారుతీ చిత్రం ఎంతవరకొచ్చింది?

మీ చిత్రం ఎంతవరకొచ్చింది? అని మారుతీ ప్రొడక్షన్స్ అధినేత శ్రీ ఏ లక్ష్మికుమార్‌ను అడిగాను "నవంబర్ షెడ్యూల్‌తో పూర్తవుతుంది అక్టోబర్ 20 నుండి నవంబర్ 5 వరకు జరిగిన షెడ్యూల్లో నాలుగుపాటలను, ముఖ్యమైన ఫయిట్స్‌ను, మరికొన్ని సన్నివేశాలను చిత్రీకరించాము" అన్నారు లక్ష్మికుమార్. శ్రీ జి సి శేఖర్ దర్శకత్వంలో శ్రీ లక్ష్మికుమార్ నిర్మిస్తున్న "శివకేశవులు" వర్ణ చిత్రానికి సంబంధించిన వివరాలే పై నుదహరించినవి. "శివకేశవులు"గా మురళీమోహన్, చంద్రమోహన్ నటిస్తున్న ఈ వర్ణ చిత్రంలో ప్రభ, జయమాలిని, పండరీబాయి, రాజబాబు, ప్రభాకరరెడ్డి తదితర పాత్రలను పోషిస్తున్నారు.

# సి ని మా

## హైదరాబాద్‌లో విజయనిర్మల?

మాడమ్ విజయనిర్మల హైదరాబాద్‌లో మకాం పెట్టారు. విజయకృష్ణామూవీస్ నిర్మిస్తున్న స్కోప్ వర్ణచిత్రం "హేమా హేమీలు" షూటింగ్‌తో బిజీగా వున్నారు మాడమ్ నిర్మల. "నిర్మల టేకింగ్ నీట్‌గావుంది. ఈజీగావుంది" అన్నారు విజయనిర్మలగారి దర్శకత్వం గూర్చి ప్రశ్నించగా అక్కినేని. మనరాష్ట్రముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డి, శ్రీఫిలింస్ అధినేత శ్రీ పి. చంద్రశేఖరరావు చేతులమీదుగా ప్రారంభమైన "హేమా హేమీలు" చిత్రం తొలిషెడ్యూలు డిశంబర్ 15 వరకూ కొనసాగుతుంది. ఈ చిత్రం ఇన్‌డోర్ షూటింగ్ అన్నపూర్ణాస్టుడియోస్, భాగ్యనగర్ స్టుడియోస్, సారథీస్టుడియోస్‌లో జరుగుతుంది. ఊటీలో, నాగార్జునసాగర్‌లో కొన్ని సన్నివేశాలను చిత్రీకరించడం జరుగుతుంది. అక్కినేని, కృష్ణ, విజయనిర్మల, జరీనా ప్రధాన పాత్రలను పోషిస్తున్న ఈ చిత్రం ప్రేక్షకలోకానికొక సెన్‌సేషన్!



'కలియుగ మహాభారతం'లో మాధవి

## ప్రభాకరరెడ్డి చిత్రంలో ప్రేక్షకుల అభిమాన జంట

శోభన్‌బాబు, శారద కలిసి నటించిన అన్ని చిత్రాలు ప్రేక్షకులను ఆకర్షించి... నిర్మాతలకు అత్యధిక లాభాలను ఆర్జించిపెట్టాయి.

నిస్సారమైన కథలు ప్రారంభమయ్యేసరికి... ఉత్తమశ్రేణి జంటకు చిత్రాలు "నో" అయ్యాయి.

ప్రేక్షకుల అభిమాన జంటగా ప్రఖ్యాతి బడసిన శోభన్... శారదగార్లకు సమాన బలం వున్న పాత్రలను... నిర్మాత... కథకుడు... నటుడు

శ్రీ ప్రభాకరరెడ్డి తను తలపెట్టిన చిత్రంలో యిచ్చారు.

నటుడు శ్రీ ప్రభాకరరెడ్డి కథలు అల్లిక వెయ్యడంలో... కథనం రూపొందించడంలో సిద్ధహస్తుడు అన్నది ప్రజలెరిగిన నిజం.

జయప్రద కంబైన్స్ పేరిట... నటుడు ప్రభాకరరెడ్డి ప్రారంభిస్తున్న వర్ణచిత్రంలో శోభన్‌బాబు... శారదగార్లతోబాటు శ్రీదేవి ఒక ముఖ్య పాత్రను, "మన వూరి పాండవులు" చిత్ర నాయిక గీత ఒక ప్రధాన భూమికను నిర్వహిస్తున్నారు.

డిశంబరులో ముహూర్తం, జనవరి ... ఫిబ్రవరి మాసాలలో మిగతా షూటింగు పూర్తి కాగలదని, దర్శకుడు శ్రీ లక్ష్మీదీపక్ తెలిపారు. జయప్రద కంబైన్స్‌కు ముద్దిపట్ల సూరి రచనను, సత్యం సంగీతాన్ని, వెంకన్నబాబు ప్రొడక్షన్ను నిర్వహిస్తారు. పూర్ణా పిక్చర్స్ విడుదల.

— శ్రీనివాస్

---

పెరుగుతున్న సంవత్సరాలు

# కాల్షియం-శాండోజ్

సంవత్సరాలు







పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి. పసిదనం నుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది.

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు. అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి. రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే, అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన, కాల్షియంను సమకూర్చి, గట్టిపళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి. విటమిన్ సి, డి మరియు బి12తో పటిష్ఠం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్లల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెనీలా సువాసన ఉంది.

కాల్షియం-శాండోజ్
స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్
వారు రూపొందించినది,
ప్రపంచంలోని
అత్యుత్తమమైన కాల్షియం.




## కాల్షియం-శాండోజ్®

### గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం




daCunha/CS/26 TEL

# వైద్య సలహాలు

జి. ర్ ఆర్. ఖరగ్‌పూర్

మా అబ్బాయికి 16 సంవత్సరములు. 3 సంవత్సరముల వయస్సులో కామెర్లు వచ్చి తగ్గినవి. తర్వాత ఉబ్బసముతో బాధపడుతున్నాడు. ఎన్ని మందులు వాడినా తాత్కాలికంగానే పని చేస్తున్నాయి.

కామెర్లు, ఉబ్బసము వేర్వేరు జబ్బులు. కామెర్లు వైరస్‌వల్ల, ఉబ్బసము అలర్జీవల్ల వస్తుంది. ఆహార పదార్థాలలోగాని, వాతావరణములోగాని, దుమ్మువల్లగాని "అలర్జన్లు" (శరీరానికి పడనివి) శరీరంలో ప్రవేశించవచ్చును. ఇలా జరిగినప్పుడు శరీరంలోని నిరోధక శక్తులు పని చేయటంవల్ల ఉబ్బసం వస్తుంది. కొందరి చర్మంమీద దద్దుర్లు రావటం, కొందరికి జలుబు, కొందరికి ఆస్తమా ఇలా పలురకాలుగా, శరీరం వీటిపట్ల విరసన చూపుతుంది. కారణాన్ని కనుగొని "అలర్జీ" క్లినిక్‌లలో వైద్యం చేయించాలి. అప్పుడే వ్యాధి నయమవటానికి అవకాశము వున్నది. రోగం వచ్చినపుడు మందులు వాడితే అవి తాత్కాలికమే.

వి. ఎస్. ఎస్. ఒరిస్సా

మా అబ్బాయికి 3 సంవత్సరములు. ఇంకనూ నడవ లేకపోతున్నాడు. అమ్మ అనే మాట తప్ప ఏమీ మాటలు రాలేదు. మాటలు, నడక వస్తాయా?

భౌతిక, మానసిక, గ్రహణశక్తులు ఎన్నో కారణాలమీద ఆధారపడి వుంటాయి. తల్లి గర్భవతిగా వున్నప్పుడు వచ్చే టాక్సీమియా, పుట్టినతర్వాత ఆహారవిధానాలలో హెచ్చుతగ్గులు, పిల్లలకు వచ్చే అంటురోగాలు, విరోచనాలు, వాంతులు, "ప్రైమరీ కాంప్లెక్స్", కొన్ని ఇతర కారణాలవల్ల మెదడులో వచ్చే మార్పులు (మెంటల్ డెఫిషియన్సీ) ఈ మూడింటికీ ముఖ్య కారణాలు. ఈ కారణాల దృష్ట్యా మీ అబ్బాయిని నిపుణుల చేత పరీక్ష చేయించటం అవసరం.

భౌతిక, మానసిక, గ్రహణశక్తులు పిల్లలకి సకాలంలో ఏర్పడటం సహజమే అయినా కొంత మేరకు—మూడు నాలుగు నెలలు అలస్యము అయినప్పటికీ గూడా బాధపడనవసరము లేదు.

టి. ఎస్. పి. ఇబ్రహీంపట్నం

వేసవికాలంలో పిల్లలకు పొక్కులు, కురుపులు రావటానికి కారణము ఏమిటి? అవి తగ్గాలంటే ఏమి చెయ్యాలి?

వేసవికాలంలో బయటి వాతావరణపు ఉష్ణోగ్రత ఎక్కువగా వుంటుంది. ఆ సూర్యకిరణాలు శరీరముమీద పడి చర్మం వేడెక్కుతుంది. ఆ సమయములో చెమట పట్టడంవల్ల లేక చన్నీటి స్నానం చెయ్యటంవల్ల, లేక చల్లనిపానీయాలు ఎక్కువగా తీసుకోవటంవల్ల, వేడి చర్మంమీద చన్నీళ్ళు పడగానే చర్మంమీద పొక్కులు ఏర్పడతాయి.

కురుపులు మామిడిపండ్లు తినటంవల్ల, బిస్కట్లు ... క్రిములు తినటంవల్ల వాటిలోని సూక్ష్మక్రిములు (పండ్లు పండటానికి సూక్ష్మక్రిములు అవసరం) వాతావరణపు వేడికి బాగా పెరుగ గలుగుతాయి. అప్పుడు శరీరమంతా కురుపులు లేవటానికి అవకాశం వున్నది.

ఇవి వచ్చినపుడు పెన్సిలిన్, టెర్రామైసిన్ ఇంజక్షనులు లేక ఎరిత్రోమైసిన్ మాత్రలు—సిరప్, విటమిన్ "సి" వాడాలి.

బి. ఆర్. ఆర్. ఒరిస్సా

నాకు చాలా సంవత్సరములుగా మూలవ్యాధి వున్నది. అప్పుడప్పుడూ రక్తము కారుతుంది. దీనికి ఏమి చెయ్యాలి?

మూలవ్యాధి రావటానికి చాలా కారణాలు వున్నాయి. లివరు దెబ్బతినటం, రక్తనాళాలు అడ్డుపడటం వల్ల సాధారణంగా వస్తూ వుంటుంది.

మలము వెలుపలికి వచ్చే ప్రదేశములోని మ్యూకస్ పొర క్రింది రక్తనాళములు వుబ్బి వుండలుగా చుట్టుకొని వుండటాన్నే పైల్సు అంటారు.

మలములో తగినంత నీరు లేక పోయినపుడు రాపిడివల్ల నెత్తురు కారటం జరుగుతుంది.

మీరు శస్త్రవైద్యులచేత పరీక్షచేయించుకోండి. మరీ పెద్దవిగా వుంటే శస్త్రచికిత్స చేయించాలి. చిన్నవిగా వున్నప్పుడు "అనూజెసిక్ హెచ్.సి", పైలెక్స్ వంటి ఆయింట్‌మెంట్లు వాడవచ్చును. ఆహారంలో నీరు ఎక్కువగా తీసుకోవాలి. మల బద్ధకం రాకుండా చూసుకోవటం ముఖ్యం.

—డా॥ కె. వెంకటేశ్వరరావు

# గొడుగు




మడవనూరి సుబ్రహ్మణ్యం

గొడుగు కొనాలన్న నా ఆశ ఈనాటిది కాదు. ఎప్పుడో పెళ్లప్పుడు అత్తగారిచ్చిన 'కాశీయాత్ర' గొడుగు ఐదేండ్ల క్రితం రెక్కలిరిగి అటకెక్కి కూర్చుంది మూలపడిన ముసలిదానిలా. నా హెడ్‌క్లర్కు జీవితం మరో నాలుగేళ్లలో ముగియబోతూంటే, నా కంటే ముందే అది ఊడిగి పోయింది. అప్పట్నుంచి క్రొత్తది కొనాలనుకుంటూనే వున్నాను. కానీ వీలుపడ్డంలేదు. వచ్చే జీతం కటాకటిన సంసారానికి సరిపోతే చాలనిపిస్తుంది.

ఇంట్లో రోగిష్టిభార్య మందులకు, తోటకూర కాడల్లా పెరిగి, పెళ్లీడుమించిన ఇద్దరమ్మాయిల అలంకారాలకు, కాలేజి చదువు వెలగబెట్టే ఓ మగవెధవ జల్సాలకు, అంతేగాక తిరుపతిని సందర్శించే బంధుకోటి (భక్తకోటి) మర్యాదలకు, ఇంటి ఖర్చులకు పోగా మిగిలేది చిల్లుపడిన ఖాళీ జేబు, వేడి నిట్టూర్పులూను. గొడుగు కొనడం మాట అలావుంచి, మాసిక వేసిన షర్టులకు బదులు క్రొత్త చొక్కా తీసుకుందామంటే పడటంలేదు.

లైఫ్ ఇన్సూరెన్స్ అని, బ్యాంక్‌లోనని, ప్రావిడెంటు ఫండని, ఇదని, అదని పోగా వచ్చే జీతం అరొందలు ముప్పయి రోజుల జీతం ముప్పయి నిముషాలైనా నిలువదు జేబులో. మొదటి తారీఖున, జీతంతో వస్తుంటే, వచ్చే దారిలో— నెలంతా తెచ్చిన ఇంటివెచ్చాల పద్దుపుస్తకం చేతిలో వుంచుకుని, ఆంజనేయులుశెట్టి పళ్ళికిలిస్తూ కనిపిస్తాడు. ఎంతో వినయంగా నమస్కరించి, (మరో రోజైతే ముఖం చిట్లించుకుంటాడనుకోండి!) పద్దుపుస్తకం ముందరేస్తాడు. బాకీ తీర్చి బయటపడి, ఎదురుగా మందులకొట్లోకి వెళ్ళి, డాక్టరు రాసిచ్చిన పట్టీలో అవసరమైనవి మాత్రమే కొని, (డబ్బులు చాలవు కనుక నాదృష్టిలో కొన్ని అనవసరమైనవే మరి!) మిగిలిన పైసల్తో ఇంటికొచ్చిపడితే 'ధనియాల కాఫీ'మాత్రమే ప్రాప్తం. రాత్రికి చారన్నం వరకే పరిమితం. ఇంట్లో అన్నీ నిండుకున్నాయన్న విజాన్ని కూతుర్లు పదే పదే ఈ విధంగా గుర్తుచేస్తారు.

ఏదో తిని, తిరిగ్గా కూర్చుని, ప్రక్కింటి నుండి తెచ్చిన పేపరు (నాకు పేపరు కొనే తాహతు ఎక్కడిది?) చదువుదామనుకుంటే ఆరోజు కరెంటు వుండదు తెల్లారగానే కరెంటు బిల్లు కట్టాలనడానికి అది సంకేతం. ఇక. రోజూ పొద్దెక్కందే రాని పాలవాడు, జీతం అందిన మరుసటిరోజు మాత్రం, వేకువనే వచ్చేస్తాడు. నిత్యంతెచ్చే పాల (నీళ్ళపాల)లా కాక, చక్కగా సుప్రభాతం పలుకుతూ, చిక్కటి పాలు పోస్తాడు. వాడికి డబ్బిచ్చి పంపించేసి, స్నానం - సంధ్య గావించి, కరెంటు బిల్లు కట్టటం కోసం మగవెధవని అడుక్కుంటే, కమిషన్ లేందే 'క్యూ'లో నిలబడనంటాడు వాడు. (నామాట ససేమిరా వినడు కాబట్టి కొడుకైనా 'వెధవా'ని అనాల్సొస్తూంది. మరోలా భావించకండి!) ఇక, ఒక అమ్మాయిని కిర్సనాయిల్ క్యూలోనూ, మరొకమ్మాయిని చక్కెర క్యూలోను, నిలబెట్టక తప్పదు బజార్లో వెకిలి వెధవల మొరటు చేష్టలను చూస్తూ ఊర్కోమని, వాళ్ళను ప్రాధేయపడి పంపక తప్పదు. ఆఫీసు వదలగానే ఖాతా తీసుకుని, ఆ సాయంత్రం ఆంజనేయులు శెట్టి కొట్టుకెళ్తే, అరువు బేరం అని ఓ చిన్నచూపు చూసి, అరునొక్కరాగం ఆరాటపడుతూ తీసి, అర్ధగంటక్కాని ప్రసన్నంకాడు.

ఇన్ని ఖర్చులు, ఇన్ని బాధలు పడి, మూడవరోజు (జేబు)చూసుకుంటే మిగిలేది (మిగుల్చుకుంటే) ఇరవయ్యో ముప్పయ్యో! ఇక గొడుగు నేనెలా కొనను?

కూతుర్లు, తమను నెలకొక సినిమాకైనా పంపలేదని, పెళ్ళయ్యుంటే తమ భర్తలతో ఎంచక్కా వెళ్లేవాళ్ళమని నిష్ఠురపడ్డినా, తనకు పేకెట్ (పేకాట) మనీ ఇవ్వలేదని కొడుకు అలిగినా, భార్య తన రోగానికి సరిగ్గా మందులు తేలేదని నిందించినా, చూస్తూ ఊర్కోవడం తప్ప నేను చేయగల్గిందేమి లేదు.

కాకపోతే నా అసమర్థత, అన్నిటికి కారణమని వారందరి వాదన. నేను 'లంచం' పుచ్చుకుంటే అందరూ హాయిగా బ్రతుక వచ్చునని వారి అభిప్రాయం. వారి వాదనలో కొంత నిజం లేకపోలేదు. నేను 'ఊ' అంటే నా 'షేర్' ప్రకారం నా సీటును బట్టి (స్టేటస్‌ను బట్టి) రోజుకు పదో పరకో నాకు ముట్టకపోదు. ఐనా లంచం తీసుకోవడం నా కిష్టంలేదు. మాఆఫీసులో టేబుల్ పైన పెట్టబడే 'బరువు'లు, టేబుల్ క్రిందనుంచి వచ్చే 'ఆమ్యామ్యాలు' లోయర్ డివిజన్ క్లర్క్ లోకనాథం దగ్గర్నుంచి, చీఫ్ క్లర్క్ చిదానందాన్ని చిద్విలాసంగా చేరి, డిస్పాచింగ్ క్లర్క్ దామోదరం వద్దకు వస్తాయి. మధ్యలో నే నొకణ్ణి అడ్డు కనుక ప్రక్కసీటు స్టెనో శకుంతల ద్వారా ఆఫీసర్ ఆనందరావు గదిలోకి రయ్యి మని దూసు కెళ్తాయి. ఆఫీసర్ అప్రూవల్ కాగానే- గుమాస్తా గుర్నాథం ద్వారా గ్రేడ్ ప్రకారం, విభజింపబడి, అందరికీ పంచి పెట్ట బడుతుంది.

ఇక ఎవరికి వారు స్వహస్త లాఘవంతో తీయని మాటల్తో, పార్టీల దగ్గర్నుంచి టీలు, టిఫిన్లూ పార్టీలు (వెట్)లాగుతూనే వుంటారు. కాని నాకు మాత్రం ఇదంతా ఓ రోతలా అనిపిస్తుంది. చూస్తూ వూర్కోడం తప్పనిచ్చి మరేం చేయలేను. అక్కడికీ, ఓమారు ఇలాటి అన్యాయాన్ని వేలెత్తి చూపినందుకు, అందరూ కల్సి నాపైనే లంచం తీసుకున్న నేరాన్ని మోపి డిప్రమోషన్ చేయించారు. నా వేలిని నేనే కొరుక్కునేలా చేశారు. లేకపోతే నేను ఆఫీసర్నయుండేవాణ్ణి ఈవేళకి.

మా యింట్లో రోజుకు ఒక్కసారైనా గొడవ జరుగుతుంటుంది దీన్ని గురించి. ఇంటావిడ ఎప్పుడూ సాధిస్తూనేఉంటుంది— ఏదో పేన్నీళ్ళకు (జీతానికి), చన్నీళ్ళు (లంచం) కలిస్తే, మామూలు గొడుగే కాదు బంగారు గొడుగు చేయించుకో వచ్చునని. అయినా నాకు పాపపు సొమ్ము తిని అరగించుకునే శక్తి లేదు, ఉద్దేశ్యమూ లేదు. లంచం తీసుకోనంత మాత్రాన ఏలాగో గొడుగు కొనలేనని కాదు. ఏ పాతికో, ముప్ఫయ్యో మిగుల్చుకోవచ్చు. కాకపోతే అది ఏ అత్యవసర ఖర్చుకు ఆదుకుంటుందని ఆశ! ఐనా అది బంధువుల తాంబూలాల్లో పెట్టే రవిగుడ్డకో, రిక్షా చార్జీకో అయి పోతూంటుంది (అవునండి! అవి మాత్రం అర్జంటు ఖర్చులు కావా!)

* * *

ఆరోజు మధ్యాహ్నం మూడుగంట లయ్యింటుంది. బయట జోరుగా వర్షం. ఆఫీస్ స్టాఫ్ అందరూ ఒక్కొక్కరే గొడుగులు పట్టుకుని ప్రక్కనే వున్న క్యాంటిన్‌కు వెళ్తున్నారు. స్టెనో శకుంతల నావైపు ఓసారి నిర్లక్ష్యంగా చూసి, గొడుగు పట్టుకుని తనూ బయల్దేరింది. నేను స్ట్రిక్ట్‌గా వుంటానని, తనని డిసిప్లిన్డ్‌గా వుండమంటానని, మగవాళ్లతో అనవసరంగా మాట్లాడితే, చనువుగా ప్రవర్తించితే ఆమె తల్లితండ్రులకు చెబుతానని కోపం. అందుకే నాకు గొడుగు లేదని తెల్సినా మాటవరుస కైనా పిలవకుండా వెళ్ళిపోయింది. ఐనా ముసలివాడి ప్రక్కన గొడుగులో నడవడం ఆమెకు నామోషీ కదా! చిన్నగా నవ్వుకున్నాను ఆమె ప్రవర్తనకు. ఎవర్నీ గొడుగు కోసం యాచించ దల్చుకోలేదు. నాలుగవుతోంది గంట. నాకు తలనొప్పి ప్రారంభమైంది. మూడుపూట్లా టీయో, కాఫీయో లేందే ఇదో బాధ నాకు. క్యాంటిన్ కెళ్ళిన అందరూ తిరిగి వచ్చేశారు. ఇంకా వాన తగ్గలేదు. తలనొప్పితో ఏం చేయ డానికి పాలుపోలేదు. ఫైళ్ళన్నీ మూసి తల పట్టుకూర్చున్నాను. అందరూ నాకేసి చూసి, ముసి, ముసిగా నవ్వుకుంటున్నారు.

ఇంతలో గుమాస్తా గుర్నాథం ఆఫీసర్ గది నుండి బయటకొచ్చాడు. వాడి చేతిలో ఫ్లాస్క్ వుంది. నా బాధను గమనించి నట్టున్నాడు. "సార్! మీరు టీ తాగలేదు లా వుంది. ఇందులో ఒక కప్పు వుంది త్రాగండి" అంటూ ఇచ్చాడు. నేనంటే వాడికి వల్లమాలిన అభిమానం. "మీలో ఒక్క చెడ్డగుణంకూడా లేని మహానుభావులు. ఈ యుగంలో వుండాల్సిన వారు మాత్రం కాదు." అని ఎన్నోసార్లు పొగిడాడు కూడా. అలాటివాడు ఇస్తే తీసుకోకుండా వుండలేక పోయాను.

టీ త్రాగుతూంటే "మీరూ ఓగొడుగు కొనుక్కోండి సార్!" అని చల్లగా సలహా యిచ్చాడు.

"అవునోయ్! కొనాలి. ఈనెల జీతంలో తప్పక కొనేస్తాను. ఎలాగు ఓవర్ టైం అలవెన్సు కూడా వస్తోంది" అన్నాను ధీమాగా.

ఆ సాయంత్రం జీతాలందాయి. ఇంటి కెళ్ళివచ్చి గొడుగు తీసుకోవచ్చని, నేరుగా ఆఫీసునుంచే ఇంటి కెళ్లాను. అక్కడ పెద్ద హడావుడి జరుగుతూంది. ప్రక్కింటి నుంచి యాభై రూపాయలు బదులు తెచ్చారట. స్వీటు, కారం తయారు చేశారు. మా పెద్దమ్మాయిని అలంకరించారు. పొరుగింటి కుర్చీలను అందంగా అమర్చారు. మరో యింటి నుండి ఎలక్ట్రిక్ బల్బులు తెచ్చి తోరణాల్లా కట్టారు. అక్కడున్న సామగ్రితో








## గొడుగు

చాలవరకు ఇరుగింటి, పొరుగింటి వాళ్ళదే ఐనా, ఒక్కందుకు నేను గర్వపడుతాను. ఇల్లుమాత్రం నా స్వంతం. స్వార్జితంతో నేను చక్కగా కట్టించినది బాడుగ బాధలేవు. ఇంట్లో అడుగుపెట్టిన నాకు అది నా యిల్లేనా అన్పించింది "ఏమిటబ్బా ఈ తతంగం?" అని ప్రశ్నించాను.

"మనమ్మాయికి పెళ్ళిచూపులండీ నిన్న విజయవాడనుంచి, మన ఏడు కొండలస్వామి దర్శనానికి వస్తామన్న బంధువులు, ఈరోజు వస్తామని ఉత్తరం రాశారు మధ్యాహ్నం అందింది అందులోవారు ఏంరాశారో తెల్సా! వాళ్ళబ్బాయి ఒకతను మనమ్మాయిని పెళ్ళిచూపులు చూట్టానికి ఒప్పుకున్నాడుట." అంటూ సంతోషంగ చెప్పింది నా ఆవిడ. ఓవర్ టైం అలవెన్సులో గొడుగుకొనాలన్న ఆశ కాస్తా అడుగంటి పోయింది. పోతే పోయిందిలే, అమ్మాయికి పెళ్ళి కుదిరితే అదే పదివేలని స్వామికి మొక్కుకున్నాను.

ఇటు మధ్యాహ్నపు ఎండ, అటు సాయంత్రం కురిసే వాన, చూస్తుంటే గొడుగుంటే ఎంత సౌకర్యమో! అని అన్పిస్తుంది. కాని డబ్బంతా ఖర్చయిపోయింది. ఏం చేయను? వానకు తడిసి, ఎండకు ఎండే కుక్కలా ఐపోయింది నా బ్రతుకు

ఆఫీసు నుంచి వస్తుంటే చినుకులు ప్రారంభమయ్యాయి. నడిబజార్లోకొచ్చేసరికి పెద్దగా కురవ నారంభించింది. పక్కనే వున్న షాపులోకి వెళ్ళి తల దాచుకున్నాను ఇంతలో ఓ కుక్క . పూర్తిగా తడిసి నా ప్రక్కనేవచ్చి నిలబడింది చలికి వణకుతు. ఎప్పుడో విన్న సామెత గుర్తొచ్చింది నాకు. చలి పుట్టినప్పుడల్లా కుక్క అనుకుంటుందిట ఓ దుప్పటి కొనేయాలని; నేననుకున్నట్లు – వానొచ్చినపుడల్లా గొడుగు కొనాలని ఆ కుక్కను చూస్తే జాలి కల్గింది. ఎవర్నీ ఏమి అడగలేని మూగ జంతువు. దానికి జల్లు పడకుండా వానకు అడ్డంగా నిల్చున్నాను. ఇంతలో షాపు యజమాని వచ్చి, కర్రతో దాని తుంటిపై బాదాడు 'వెధవకుక్క'అని ఈసడించుకుంటూ. అది 'కుయ్యో! కుయ్యో!' మంటూ వానలోకి పరుగెత్తి

పోయింది. నాకు అయ్యో! అన్పించింది. 'వెధవ మనుషుల'ని నన్ను కూడా తిట్టుకుని వుండవచ్చు 'మనసులో' అనుకున్నారు.
యధాలాపంగా షాపును కలియజూశాను! ఓ మూల అందంగా అమర్చిన గొడుగులు, సీర సైనికుల్లా నిలబడి వున్నాయి. అవి నన్ను చూచి నవ్వుతున్నట్లనిపించింది. అందులో ఒకటైనా నాదైతే ఎంత బాగుణ్ణు? జేబు చూసుకుంటే రొండొ పైసలు మాత్రమే వుంది. యాభై పైసలకు, గొడుగు ఖరీదుకు నక్కకు, నాగలోకానికి వున్నంత దూరం.

# గొడుగు

నా చూపుల భావం గ్రహించినట్లు, "సార్! మీకు గొడుగు కావాలా సార్!" అడిగాడు షాపు యజమాని. "అబ్బే! వద్దు బాబు వాన రాదని నా గొడుగు ఇంట్లో పెట్టి వచ్చాను! ఊర్కే చూస్తున్నాను" అని అబద్ధమాడాను. మాట్లాడకపోతే, అన్ని గొడుగులు తీసి ముందేసేలా వున్నాడు. ఇంతలో వర్షం తగ్గింది. ఇంటికి బయల్దేరాను.

* * *

వెంకటా చలపతి చలవ వల్ల మా అమ్మాయి పెళ్ళి కుదిరింది. కట్నం తీసుకోవన్నాడు పెళ్ళికొడుకు. ప్రావిడెంట్ ఫండు డ్రా చేశాను. నిరాడంబరంగా పెళ్ళి చేసేయాలనుకున్నాను. ఈ పెళ్ళిలోనైనా అల్లుడికిచ్చే కాశీయాత్ర గొడుగుతో బాటు, నేనూ ఓ గొడుగు కొనేయాలనుకున్నాను.

పెళ్ళి కవారంవుందనగా ఇంట్లో అందరం కల్సి పెళ్ళిసామానులకని సాయంత్రంగా బజారు వెళ్లాం. అన్నీ కొన్నతర్వాత, గొడుగుల షాపుకెళ్ళి, రెండు గొడుగులు కొనేశాను. నాకు ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కినంత ఆనందమైంది. చంద్రమండలం సందర్శించినంత సంతోషమైంది. ఇంకా చెప్పాలంటే, కొడుక్కి ఉద్యోగం వచ్చినంత, నా భార్య సంపూర్ణ ఆరోగ్యవంతురాలైనంత, నేను ఆఫీసరైనంత ఆనందం పొందాను. వాన లేకపోయిన, రాత్రి ఏనిమిదవుతున్నా, గొడుగు పట్టుకుని నడవసాగాను. మా వారంత నా పిచ్చికి విస్తుపోయారు. వారంతా సామాన్లెక్కించుకుని రిక్షాలో వెళ్ళిపోయారు. నేను మాత్రం గొడుగు పట్టుకునే ఇంటికి నడిచాను.

మా అమ్మాయి పెళయిపోయింది. బంధువు లందరూ వెళ్ళిపోయారు. ఇల్లు ప్రశాంతంగా తయారైంది. నేను పెళ్ళికి పెట్టిన లీవు ఐపోయింది. ఆఫీసుకు బయల్దేరబోతూ వరండాలో కొచ్చాను. గొడుగు గుర్తొచ్చింది. "ఏమేవ్? గొడుగిలా పట్రా!" కేకేశాను. 'ఈ రోజెలాగైనా కొత్త బట్టల్లో దర్జాగా, కొత్త గొడుగు పట్టుకుని తీవిగా, ఆఫీసుకు వెళ్ళాలి. ఈ రోజు వాన తప్పక రావాలి. అందరి కంటే ముందే టీ త్రాగి రావాలి క్యాంటిన్ కెళ్ళి'

అని ఆలోచిస్తున్నానేగాని, ఎంతకూ మా ఆవిడ గొడుగు తెచ్చివ్వలేదు. వంటింట్లో ఏవర్నో కేకలేస్తోంది. విసుగెత్తి నేనే వెళ్లాను వంటింట్లోకి. మా అబ్బాయి, రెండో అమ్మాయి తప్పు చేసిన వాళ్ళలా తలొంచుకున్నారు. మా ఆవిడ తిడుతోంది వాళ్ళని. "బుద్ధి లేకపోతే సరి! ఎంతో కష్టపడి కొనుక్కున్నదాన్ని పరులపాలు చేశారు. మీకు మతి మరుపు ఎక్కువై పోతూంది" అని.

"ఏమిటే గొడవ? నేను గొడుగు తెమ్మంటూంటేనూ!" అన్నాను మరీ విసుగ్గా.

"దాన్ని గురించేనండి నేనంటున్నది. నిన్న పెళ్ళికొడుకు తరపువాళ్ళు బలవంతం చేస్తే, అన్నా, చెల్లెళ్ళిద్దరూ వారితో బాటు సినిమా కెళ్లారు. వాన వస్తుంటే మీ గొడుగు పట్టుకెళ్లారు. అప్పటికీ నే చెప్పాను 'జాగ్రత్త'ని. అనుకున్నంతా చేశారు; సినిమాహాల్లో పెట్టి మర్చిపోయి వచ్చారు" అంటూ వసుగుతూ చెప్పింది.

అది విని నిలువునా నీరైయ్యాను ఏమీ మాట్లాడలేక.

## గుర్తుకు తెచ్చుకో నేస్తం

గుర్తుకు తెచ్చుకో నేస్తం
నీ తొలి స్పర్శకూ మలి స్పర్శకూ మధ్య
నేనెంత శూన్యతను ఎదుర్కొన్నానో
నిరీక్షణకు నిర్వచనం నాకు చెప్పకు.
నిద్రాణమైన తలపును తట్టి లేపకు
రెప్పపాటు కాలంలో
అనిర్వచనీయానుభూతులు,
పరిభ్రమిస్తున్న కాలానికి
ఎక్కడో ఎప్పుడో గండి పడచ్చు,
కోరికల విత్తనాలు మొలకలెత్తనూ వచ్చు
దృష్టిసోకినంత మేరా
తారకలు నమ్మారిస్తున్నాయి.
ఆతిథ్యం కోరి నిరీక్షిస్తున్నాయి.
గుర్తుంచుకో నేస్తం.
నేను
ప్రేమించ బడటాన్ని ప్రేమిస్తాను.
భావశూన్యతను భరిస్తూ
ప్రేమించబడటాన్ని ప్రేమిస్తాను.

— వాణీ రంగారావ్




**జి. వి. ఎస్. — సునాబేడ**

స్త్రీకి మానం ముఖ్యమా? మాతృత్వం ముఖ్యమా?

★ మానం పోగొట్టుకుంటేగాని మాతృత్వం సిద్ధించదు కదా! అందుకే-ఎంతో ఆరాధించే వ్యక్తి లభ్యమైనప్పుడే-అతడిని భర్తగా స్వీకరించి మాన ప్రాణాలని అర్పించాలని అనుకుంటుంది స్త్రీ. అలాంటి కలయిక ద్వారా లభ్యమైన మాతృత్వాన్నే వరంగా ఎంచుతుంది-అంచేత ఈ రెండూ స్త్రీలో పడుగూ పేకా.

సినిమాలో హీరోయిన్ గర్భం ధరిస్తే ఆ సంగతి సవతి తల్లికి తెలిస్తే "మా పరువు తీసేవు కదే" అని యింటినుండి బయటకి త్రోసి తలుపులు మూస్తారు. అప్పుడు పరువు పోదా?

★ అది ఆలోచించరు సినిమా తీసేవాళ్ళు. వాళ్ళకి కావలసింది హీరోయిన్‌ని ఏడిపించడం-అదొక్కటే డబ్బు కురిపిస్తుంది ప్రేక్షకులచేత. (మరిదాను-లేదా జయమాలిని నాట్యమూ బూతు పాటేనా వుండాలి.)

**టి. ఏ. ఆర్. ఎమ్. — గుడివాడ.**

అన్నయ్య అంటున్న ఆడపిల్లని అనుభవించడానికి ప్రయత్నిస్తున్నట్టుగా సినిమాల్లో చూపడం అలాంటి వారున్నారని చెప్పడమా? అలా చెయ్యమని ప్రబోధించడమా?

★ రెండూ కాదు-ఎలాగో అలా డబ్బులు రాబట్టుకోడానికి అంతే. తెలుగు సినిమాలు ప్రేక్షకుల మంచి చెడ్డలనాలోచించి తీస్తున్నారని యింకా అనుకుండేటంత అమాయకులున్నారా?! ఆడదాన్ని "చెరచడం" హాబీగా చిత్రీకరింపబడుతున్న యీ సినిమాలనుంచి జనం ఏం నేర్చుకున్నా నష్టపోయేది-తీసేవాళ్ళు. వాళ్ళ వాళ్ళు కాదు; పైవాళ్ళ ఆడపిల్లల మీద అత్యాచారాలు జరిగితే వారికేం? చూడండి, సినిమాదో వింత ప్రపంచం. ఇప్పుడు-మళయాళం దిగుమతి చేసి డబ్బు చేసుకుంటున్నాం-అక్కడ సెక్సు సెక్సు కాదట-అభ్యుదయంట!! ఇదివరకు తాగుబోతు తిరుగుబోతు, జూదరి, పొగరుబోతు మొరటువెధవ లన్నవి తిట్లనుకునేదాన్ని. అవన్నీ హీరో సద్గుణాలని తెలిసింది. బజారు బొమ్మ అంగడి బొమ్మ, అమెరాత్రులు, సెక్సీ కలలు-అద్దెకో అమ్మాయి అన్నీ వ్యసనాలకి చిహ్నాలనుకునే దాన్ని; యిప్పుడవి-అక్షరాస్యత అధికంగల కేరళ నాటి ఉత్తమ చిత్రాలు! మన "నిరక్షరాస్యతని" తొలగించడానికి దేశాన్ని దోచుకుంటున్నాయి!! అంచేత-సినిమాలు చూడండి-కావలిస్తే:- వాటిలోని ఆచరణలోకి తేవాలని ప్రయత్నించకండి అదేచాలు! కనీసం కేరళలో అయ్యప్ప-కమ్యూనిజం భుజం భుజం కలిపి తిరుగుతున్నాయి-మనకిక్కడ - భక్తి లేదు: జనం పట్ల గౌరవం లేదు...ఏది చేసినా పోజుకోసం; స్వలాభంకోసం; స్వంతంకాని ఆడదాన్ని కించపరచడంకోసం-అంతే.

**వి. వి. ఎల్. — బెంగుళూరు.**

రాసే పైమా వంటపైమా తిండిపైమా జవాబు చాలా నచ్చింది. అంతగొప్ప రామలక్ష్మి గారుకూడా వంటచేస్తూ చూడు ఇంటి సంగతి ఎలా చూస్తున్నారో అన్నారు మావారు.

★ రచయిత్రి ఆడది కాదనుకోండి-(దొంగ పేర్ల ఆడరచయిత్రుల సంగతి కాదు) ఇల్లు అంటూవున్నాక- దాన్నిపట్టించుకోకపోతే- బాధపడేది యిల్లాలే. చేసేపనులలో ప్రియారిటీలు చూసుకోవాలి. స్వంతవాళ్ళని కనిపెట్టలేని రచయిత్రి-రచనలో ఎంత అభ్యుదయం ప్రకటించినా-అబద్ధమే అవుతుంది. వంట కూర్చుని చేయక్కరలేదు-ఏం చేస్తున్నారన్నది ఓ కంట కనిపెట్టడం-గృహిణీ ధర్మం - వండడంలో కాదు అభిమానం వడ్డనలో వుండాలని నా నమ్మకం!

**టి. ఆర్. — ఆదిలాబాదు.**

సమానహక్కులు కావాలి అన్నవారు పుస్తె ఎందుకు కట్టించుకుంటారు? సమానహక్కులు కావాలి అన్నవారు-మొగవారు ఒక పుస్తె కడితే ఆడవారు కూడా ఒకటి కట్టండి.

★ అలాగే చేయవచ్చు! నిజానికి ఒకపుస్తె ఆడపెళ్ళి వారిదీ, రెండవది మగపెళ్ళి వారిదీ కదా! పెళ్ళికి నిదర్శనంగానే-యీ పుస్తెలు కట్టడం-రిజిస్టరు పెళ్ళి చేసుకుంటే-యీగొడవే అక్కరలేదు - అందుకే రిజిస్టర్ పెళ్ళిలోని సౌకర్యాలూ రక్షణలూ రెలిజియస్ పెళ్ళిళ్ళకి కూడా రప్పించాలని - ప్రతివివాహం - ఎలాచేసుకున్నదైనాసరే-విధిగా రిజిస్టరు చేయాలన్న ఓ సూచన కూడా లేకపోలేదు.

**ఎమ్. ఎస్. పి. — కాశీబుగ్గ**

భీముని ఉసికొల్పి సింహబలుణ్ని చంపించింది పాండవ సతి. ఈ కాలంలో యిలాంటి హత్యలు కోకొల్లలు...వాటికి కారణం ఎవరు?

★ ఆధునిక సైరంధ్రులని కాదు కద మీ ఉద్దేశ్యం? అవమానింపబడిన స్త్రీ జాతి అనండి ఒప్పుకోవచ్చు.

**వెంకట్ — ఉరవకొండ.**

మనిషి మరణానంతరం అతని ఆత్మ భూతంగా మరొక బ్రతికి వున్న మనిషిని ఆవహించుట మీరు విశ్వసిస్తారా?

★ ఏమిటి? ఆత్మ భూతంగా మారడమా? బ్రతికివున్న మనిషిని ఆవహించడమా? ఈ రెండింటిలో ఏ మాత్రం అవకాశమున్నా నేను చాలా మందిని ఆవహిస్తాను. ఇది నిజం. ●



ముక్కంటి రాజేశ్వరీరాణి

ఆరోజు పెండ్లి చూపులు మళ్ళీ... రాధ విధిగావచ్చి కూచుంది నిరాశగా. శేఖర్‌తో వచ్చిన శ్రీరామచంద్రమూర్తిని చూచి పులికిపడ్డది రాధ. అయినా నమాళించుకొని కూచుంది. శ్రీరామచంద్రమూర్తి కూడా తెలియనట్టు కూర్చున్నాడు. "థాంక్సు!" అనుకొంది రాధ.

"వెళ్లి ఉత్తరం రాస్తాము" అంటారని ఎదురుచూసింది కాని శేఖర్ వాళ్లక్కయ్యని చూచి "అక్కయ్యా! నాకు ఆ అమ్మాయి నచ్చింది! ఆ అమ్మాయి ఇష్టం కనుక్కో" అన్నాడు గట్టిగానే.

రాధ మనసు ఝల్లుమంది. శేఖర్ నిక్కచ్చి మనిషిలా వున్నాడు— వాళ్లక్కయ్య లోపలికొచ్చింది. "అత్తయ్యగారూ! మా తమ్ముడికేమో నచ్చింది మీఅమ్మాయి! మీ అమ్మాయి నడిగి చెప్పండి. దగ్గరి ముహూర్తం వుంది. అందరి ఇష్టం తెల్సిపోతే పెండ్లి ముహూర్తం నిర్ణయించుకొని మరీ పోతాము! మీరూ మేమూ అవని మీద వుండవచ్చు కదా" అని రాధ తల్లితో అనేసరికి పార్వతమ్మ ఎంతోసంతోషించింది.

"అదిగో పెళ్లికూతురు! నువే అడిగి తెల్సుకోవమ్మ! నాకేమో అబ్బాయి నచ్చాడు!" అన్నది నవ్వుతూ.

ఆవిడ దగ్గరికొచ్చింది. రాధకు కొంచెం భయంవేసింది.

"నీ కిష్టమేనా చెప్పవమ్మా మరదలా! మా తమ్ముడికి నువు నచ్చావట" అన్నది కొంచెం నవ్వుతూ.

రాధకు మరీ భయమూ, సిగ్గనిపించింది. తల ఏలాగో ఊపింది ఇష్టమని.

"ఇంకేమండి! ఇష్టా ఇష్టాలు తేలిపోయింది. ఇక వస్తామండి! రాధా! పోయివస్తాం" అని ఆవిడ హాల్లోకిపోయి "ముహూర్తం నిర్ణయించుకొందాంరా తమ్ముడూ! పిల్ల కూడా ఇష్టపడ్డది" అన్నది నవ్వి.

"వస్తామండి!" అన్నాడు శేఖర్ నమస్కరించి లేస్తూ. వాళ్లను వాకిటిదాక సాగనంపి శ్రీరామమూర్తి లోనికొచ్చాడు. "నాకు డియరెస్టు ఫ్రెండు శేఖర్. రాధ లక్కీఫెలోనండి! మంచి సంబంధమే" అన్నాడు ప్లేట్లో మిగిలిన పకోడీలని స్వాహా చేస్తూ.

"ఏదో ఈ సంబంధం కుదిరింది!" అని నిట్టూర్చింది పార్వతమ్మ.

"కుదరకుండ ఏం చేస్తుంది! రాధకు కాలు వంకరా! కన్ను వంకరా! శేఖర్ లక్కీ ఫెలో" శ్రీరామచంద్రమూర్తి అన్నాడు గట్టిగా. తరువాత లేచి "వస్తానండి! శేఖర్‌ని కల్సుకొంటూ వుంటాను. ఇద్దరం ఒకే ఆఫీసులో పని చేస్తుంటాము కదా!" అన్నాడు లోనికి తొంగిచూస్తూ, రాధ కన్పిస్తుందేమో అన్న ఆశతో.

"మంచిది నాయనా! అప్పుడప్పుడూ వస్తుండు" అన్నది పార్వతమ్మ.

"వస్తానమ్మా!" అని వెళ్ళిపోయిం తరువాత రాధ కొత్తచీర విప్పుతూ మంచం మీద కూచుంది మడిచి పెట్టడానికి.

"భగవంతుడా! శ్రీరామచంద్రమూర్తికి

# వెరైటీమనిషి

మంచి బుద్ధి ఇవ్వు! మంచివాడనే పేరు మొత్తానికి. కొంచెం తిక్కమనిషి! కాలేజీలో తాము చదువుకొనేటప్పుడు పాపం ఎన్నో అవమానాలు ఓర్చినవాడు! అప్పుడు ఆరుగురు ఫ్రెండ్సుగా వుండేవాళ్ళు. తమని సిక్స్ వివెస్ అని పిలిచేవారు! ఎంత అల్లరి చేసేవారు? చదువు విషయంలో కూడా తనదే పైచేయి కాబట్టి ప్రిన్సిపాల్ కూడా ఏమీ అనలేకుండా పోయేవాడు. వెరైటీ మనుష్యులని చూస్తే తమకు వెరైటీ ఆలో చనలు వచ్చేవి! అందరినీ ఏడ్పించేవారు! తాము అంటే అందరికే భయం. అసహ్యం కూడానట అప్పుడు! డిగ్రీలు తీసుకొన్నారు! ఆరుగురూ విడిపోయారు! ఎవరెవరు ఎక్కడవున్నారో కానీ, పెండ్లిండ్లు చేసుకొన్నారో లేదోకానీ తనకు పెండ్లి కావడం గగనంగా వుంది! తాను కాలేజీలో చదివేటప్పుడు తిరిగిన తిరుగుళ్ళు, రచ్చలు, అల్లరులు... ఈ శ్రీరామచంద్రమూర్తికి బాగా తెల్సు! వచ్చిన సంబంధాన్ని వీడే చెడగొడుతున్నాడో ఏమోకాని ఇప్పటికి చాలా తడవలు "పెండ్లి కూతురుగా" కూర్చోవాల్సి వచ్చింది. వచ్చిన వాళ్ళు "ఉత్తరం రాస్తామండి" అని వెళ్లి పోయేవారు. అంతే... ఈ ఆరేళ్ళుగా ఇదే జరిగింది. కానీ... ఈ శేఖర్ మాత్రం అప్పటికప్పుడే చెప్పాడు "ఇష్టమని!" ఇది తన అదృష్టంగా భావించినా ఈ శ్రీరామమూర్తి కూడా కరుణించాలి కదా! శేఖర్ ఫ్రెండు అంటున్నాడు. ఏంచెపుతాడో? ఏమో? పోనీ ఏం చేస్తాం? పెండ్లి రాత వుంటే జరుగుతుంది! రాధ ఆఖర్న శాంత పడి కూర్చుంది ఆలోచించడం మాని అప్పటికి దేవుడిమీద భారంవేసి.

## 2

ఇక్కడ శ్రీరామచంద్రమూర్తిని గురించి కొంచెం చెప్పాలి! మనిషి అష్టావక్రుడు! కాలేజీలో చదివేటప్పుడు ఆడపిల్లలు ఏడ్పించకుండా పోరు రోజూ. కానీ వాళ్లచేత ఏడ్పించు కోవడం ఒక వరంలా భావించేవాడు. ఆడపిల్లలు ఫ్రీగా మాట్లాడేవారు. మిగతా పిల్లలు "లక్కీఫెలోవిరా! నీతో మాట్లా డడం అంటే ఆడపిల్లలకు సరదా" అని ఒకరకంగా ఏడ్పించేవారు. కానీ శ్రీరామ మూర్తికి అవేమీ పట్టించుకోవలసిన అవశ్యం వుండేది కాదు. అందునా కాలేజీలో ఓ సిక్స్ వివెస్ జట్టు వుండేది! ఆ ఆరు మంది అమ్మాయిలని చూస్తే అందరికీ హడలే... వాళ్ళు ఆడింది ఆటగా, పాడింది పాటగా నెగ్గుకొని వచ్చారు. వాళ్ళలో రాధ, సుజాత ఇద్దరూ శ్రీరామమూర్తిని మరీ ఏడ్పించేవారు. వాళ్ళు డిగ్రీలు తీసుకొని వెళ్ళిపోయారు అంటే ప్రిన్సిపాలు కూడా నిట్టూర్చుకొన్నాడట. రాధ ఈ వూరి అమ్మాయే కాబట్టి శ్రీరామమూర్తి అప్పు డప్పుడూ చూసేవాడు. ఆ తరువాత ఉద్యోగరీత్యా పట్నంపోయి మళ్ళా ఇప్పుడు ఆరేళ్ళకు ఈ వూరికి ట్రాన్స్‌ఫర్ అయి వచ్చాడు. కానీ వున్నవూరు కాబట్టి అప్పు డప్పుడూ వచ్చిపోతున్నా రాధ విషయం అంతగా పట్టించుకొన్నది లేదు. ఇప్పుడు శేఖర్‌తో వచ్చిన శ్రీరామమూర్తిని చూచి రాధ భయపడి పోయింది. పాత కక్షలు పెట్టుకొని ఈ సంబంధం చెడగొడుతా డేమో అని.

ఆ మరునాడు నుంచి శ్రీరామమూర్తి రాధ ఇంటికి రాకపోకలు సాగించాడు. వీడితో మంచిగా వుండాలని రాధ గౌరవించసాగింది. ఈ గౌరవంలో శ్రీరామచంద్రమూర్తి అందల మెక్కాడు. చనువు తీసుకోసాగాడు. శేఖర్‌ని గురించి గొప్పలు, అతని అందం, వాళ్ళ ఆస్తి వగైరా చెప్పేవాడు.

"రాధా! శేఖర్ వెరైటీ మనిషి! వానికి బోలెడంత సోషల్ కావాలి! నువు వాడి సోషల్‌కి సరిపోతావనుకో! అయినా ఇంకా సోషల్‌గా వుండడం నువ్వు తప్పకుండా నేర్చుకోవాలి" అన్నాడు ఒకసారి.

"తప్పకుండా నేర్చుకొంటాలెండి!" అన్నది రాధ.

"మాట అంటే చాలదు రాధా! అసలు వాడేమన్నాడో తెలుసా? నిన్ను నన్ను టెస్టు చెయ్యమన్నాడు. ఎంతయినా వెరైటీ మనిషి కదా... నువ్వు నాతో సినిమాకు రావాలిట! అంటే నా మీద వాడి కెంత నమ్మకం వుందో చూసావా? రేపు రెడీగా వుండు! మొదటి షోకు పోదాం" అన్నాడు శ్రీరామమూర్తి.

రాధ ఉలిక్కి పడ్డది! అదేమి వెరైటీ మనిషి? ఇదేం పరీక్ష... శ్రీరామమూర్తితో సినిమాకు పోవాలా? కాబోయే భార్యని స్నేహి

ధర్మపథం

# లక్ష్మీదేవి అష్టస్థానాలు

లక్ష్మీదేవి ఐశ్వర్యాన్ని ప్రసాదించే దేవత. ఆ లక్ష్మీదేవి ఎనిమిది రూపాలు ధరించి అష్ట లక్ష్ములుగా ప్రసిద్ధి పొందినది. లక్ష్మీదేవి ఎనిమిది రూపాలలో ఉన్నట్లే ఐశ్వర్యాలు కూడా ఎనిమిది విధాలు. ఆ విధంగానే పురుషుని దేహంలో ఉండే అవయవాలలో ఎనిమిది స్థానాలలో లక్ష్మి వుండవచ్చును. లక్ష్మి ప్రదాలయిన స్థానాలేవో, అవి ఎట్టి ఫలాలను ఇస్తాయో మన పెద్దలు నిర్ణయించే ఉన్నారు.

"నృణాం పాదస్థితా లక్ష్మీః
నిలయం సంప్రయచ్ఛతి
సక్థ్యోశ్చ సంస్థితా వస్త్రం
ధత్తే నానావిధం బహు,
కళత్రదా గుహ్యసంస్థా
క్రోడస్థా పత్యదాయినీ,
మనోరథాన్ పూరయతి
పురుషాణాం హృదిస్థితా
లక్ష్మీర్లక్ష్మీవతాం శ్రేష్ఠ
కంఠస్థా కంఠభూషణమ్ః
అభీష్ట బంధుదారైశ్చ
తథా శ్లేషం ప్రవాసిభిః
మృష్టాన్నం వాక్యలావణ్యం
ప్రజ్ఞామ వితథాం తథా,
ముఖసంస్థా కవిత్వం చ
యచ్ఛత్యుదధి సంభవా.
శిరోగతా సంత్యజతి
తతోఽన్యం యాతి చాశ్రయమ్"

పాదములు, తొడలు, గుహ్యము, భుజములు, హృదయము, కంఠము, ముఖము, శిరస్సు అనే ఎనిమిదన్నీ లక్ష్మి నివాస స్థానాలు. వీనిలో ఏడు స్థానాలలో లక్ష్మి వున్నప్పుడు మేలే కలుగుతుంది. కాని, ఎనిమిదవ స్థానంలో వుంటే కీడు కలుగుతుంది.

పురుషుని పాదాలు లక్ష్మి స్థానాలయినప్పుడు గృహ లాభం కలుగుతుంది. తొడలను ఆశ్రయించి ఉంటే అనేక రకాల విలువైన వస్త్రాలు విరివిగా లభిస్తాయి. గుహ్య స్థానంలో వుంటే కళత్ర లాభం కలుగుతుంది. భుజాలు లక్ష్మిప్రదా లయినపుడు సంతానం కలుగుతుంది. హృదయం లక్ష్మి నిలయమైనప్పుడు పురుషుడు కోరిన కోరికలన్నీ సఫల మవుతాయి. కంఠం ఆమెకు స్థానమైనపుడు ఆభరణాలు లభిస్తాయి. ముఖం లక్ష్మిప్రదమై ఉన్నపుడు ప్రవాసంలో ఉండిన బంధువులనూ, భార్యనూ కలిసికోవడం జరగడమే కాక మృష్టాన్నం, వాక్చాతుర్యం, గొప్ప ప్రజ్ఞ, కవితాశక్తి కూడా లభిస్తాయి. కాని, ఆమె శిరస్సుపై ఉన్నపుడు కీడే కలుగుతుంది. అట్టి వానికి ఇంట్లో వున్న సంపద చల్ల చల్లగా జారిపోయి మరొకర్ని ఆశ్రయిస్తుంది.

అందువల్లనే దైత్యులు దేవతలతో యుద్ధాలు చేసి విజయాన్ని పొందినా, లక్ష్మీదేవిని అపహరించే ఉద్దేశంతో పల్లకీలో కూర్చుండబెట్టి ఆ పల్లకిని తలపై నుంచుకొని పోతూ వినాశాన్ని పొందవలసి వచ్చింది.

—బులుసు వేంకటరమణయ్య.

తునితో సినిమాకు పిల్చుకొని పొమ్మంటాడా? ఇది శేఖర్ చెప్పాడా! ఈ శ్రీరామమూర్తి కోరికా?

"చూడండి రాధా! నువు ఇప్పుడు శేఖర్ భార్యవు అయిపోలేదు. వాడు ఏమి అనుకొంటాడో అనుకోడానికి! రెడీగా వుండు రేపు" అని వెళ్ళిపోయాడు శ్రీరామమూర్తి హుందాగా.

రాధకు ఏక్కడో అఘాతంలో పడినట్లయింది. ఈ శ్రీరామమూర్తి ఏమనుకొంటున్నాడు తనని గురించి? శేఖర్‌ని ఈ విషయంగా ఎవరు అడుగుతరు? ఈ శ్రీరామమూర్తి కుట్రా? ఇది! పాతపగ మనసులో పెట్టుకొని వుంటాడా! అమ్మతో చెపితే ఆవిడ గట్టిగా కేకలేస్తుంది! ఎలా ఈ ఆపదనుండి తప్పించుకోవడం? ఈ శ్రీరామచంద్రమూర్తితో సినిమాకు పోవడమా? వద్దా? రాధ ఆ రోజంతా ఆలోచించి తెల్లవారే శ్రీరామమూర్తి ఇల్లు వెతుక్కొంటూ బయలుదేరింది. ఇల్లు ఫలానా అని తెల్సింది.

### 3

రాధ మెల్లగా లోనికొచ్చింది. లోపలకు పోతూవుంటే అది భూగృహంలా వుంది. ఒక్క కిటికీ కూడా లేదు. "ఎవరూ?" అని వచ్చిన ఆవిడని చూచి రాధ విస్తుపోయింది. "సుజా!" అంది వెర్రి ఆనందంతో.

"అరే! నువ్వా రాధా! ఎన్నాళ్ళకువచ్చావు? మా ఇల్లు ఎలా తెల్సింది?" సుజాత రాధను అమాంతం కౌగలించుకొంది ఆనందంతో.

ఇద్దరూ స్థిమితపడి కూర్చున్నారు. "శ్రీరామచంద్రమూర్తి పుణ్యమా అని నిన్ను కల్సుకోగలిగాను సుజా! మీవారు లేరా?" అని అడిగింది రాధ.

సుజాత నిట్టూర్చింది "రాత్రికి ఏకంగా వస్తారు ఇంటికి!' అన్నది.

"నువు... శ్రీరామమూర్తిని ఎలా పెళ్ళాడావు?" ఆశ్చర్యంగా అడిగింది రాధ.

"విచిత్ర పరిస్థితిలోజరిగింది ఆ పెండ్లి. నా పెండ్లికి వచ్చాడు. తీరా పెండ్లి పీటల మీద పెండ్లి ఆగిపోయింది. ఆ పెండ్లికొడుక్కు ఎవరో నేను పచ్చి రౌడీని... కాలేజీలో చదివేటప్పుడు సిక్స్ ఏవెస్‌లో నేనూ ఒకతె అని... ఏదో ఏదో చెప్పారు... ముహూర్తం అరగంట వుంది అనగా వాళ్ళు దెబ్బలాడి వెళ్ళిపోయారు. అమ్మ...నాన్న... అవమానంతో కృంగిపోతూ వుండగా శ్రీరామమూర్తి వచ్చి మీ అమ్మాయిని నేను పెళ్ళాడుతానని చెప్పి నా మెడలో తాళి కట్టాడు. అది సానుభూతితో కాదు రాధా! పగ తీర్చుకొనేందుకు! ఇప్పుడు ఇలా నన్ను భూగృహంలో పెట్టి కసితీరా బాధిస్తున్నాడు... ఒక విధంగా ఈ ప్రపంచానికి

# వెరైటీ మనిషి

నాకూ సంబంధం లేదనుకో'' సుజాత కన్నీళ్లతో అన్నది.

రాధ తన పెళ్లి విషయం చెప్పింది "జరిగింది ఇది సుజా! నామీద కూడా పగ పట్టి వున్నాడు నీ మొగుడు! రేపు అతనితో నేను సినిమాకు పోవాలిట! ఏమంటే శేఖర్ వెరైటీ మనిషి! అతనికి బోలెడు సోషియల్ కావాలి! నిన్ను సినిమాకు పిల్చుకొని పొమ్మని నాతో చెప్పాడు రెడీగా వుండు'' అన్నాడు! చూసావా! అంటే శేఖర్‌కి నామీద అను మానం కల్గించాలని కదా! ఈ పెండ్లి చెడగొట్టాలని'' రాధకూడా కన్నీరుంచు కొంది చెపుతూ.

సుజాత ఒక్క క్షణం ఆలోచించింది. రాధ చెవులో ఏదో గుసగుసగా అన్నది. "అమ్మో!'' అంది రాధ ఆ రహస్యం విని.

సుజాత నవ్వి "ఇంత పిరికి పిల్లవు ఎప్పుడయ్యావు? మోసాన్ని మోసంతోనే జయించాలి'' అన్నది.

రాధ కొంచెం ఆలోచించి "సరే! శేఖర్‌తో మాట్లాడేందుకు నువు రావాలి!'' అన్నది.

"పద!'' అన్నది సుజాత లేచి.

*    *    *

"కొంచెం చీకటి పడింతరువాత పోదాం సినిమాకు'' అన్న దాన్నిపట్టి శ్రీరామమూర్తి కొంచెం చీకటిపడ్డ తర్వాత స్కూటరెత్తు కొని వచ్చాడు. రాధ వెనక కూర్చుంది. శ్రీరామమూర్తికి ఏదో లోకానికి తేలిపోతు న్నట్లుయింది "నన్ను గట్టిగా పట్టుకో రాధా! నా స్పీడును నువు భరించలేవు'' అన్నాడు.

రాధ మాట్లాడకుండా శ్రీరామమూర్తి నడుం వాటేసుకొంది. ఆమె తలలోని మల్లెలు గుప్పుమంది! హుషారుగా పోతున్నాడు శ్రీరామచంద్రమూర్తి.

హాలు వచ్చింది రాధ ముహం చూడాలని ఆతురతగా వుంది. కానీ రాధ ముందుగా వెళుతున్నది. టికెట్లు తీసుకొని వచ్చాడు. ఇద్దరూ తడుముకొంటుపోయి కూచున్నారు. అప్పటికి సినిమా మొదలయిపోయింది.

"రాధా!'' అంటూ చేయి పట్టు కొన్నాడు శ్రీరామమూర్తి.

"ఉష్! సినిమా చూడండి! ఇంటరవెల్ తర్వాత మాట్లాడు కొందాం ... అన్నట్టు మీ వెరైటీ మనిషి శేఖర్ వచ్చాడా సినిమాకు'' అని అడిగింది మెల్లగా రాధ.

"వస్తానని అన్నాడు. ఎక్కడో కూర్చుని వుంటాడులే! నిన్ను నా ప్రక్కన చూచి దంగయిపోతాడు'' శ్రీరామమూర్తి కసిగా అన్నాడు.

"ఎందుకు? ఆయనే చెప్పాడని అన్నారు గ?'' రాధ అడిగింది.

శ్రీరామమూర్తి వెలితిగ నవ్వాడు. "ఎంత వెరైటీ మనిషి అయినా స్నేహితుడితో కాబోయే భార్యను "నువు సినిమాకు తీసుకెళ్లారా'' అంటాడా!''

"అయితే?'' రాధ భయంగా అన్నది మెల్లగా.

"రాధా! నువు సిక్స్ ఎవెన్‌లోని మొదటి నంబరు రౌడీవని నాకు బాగ జ్ఞాపకముంది! నన్ను అప్రయోజకుడని అంటావా?'' అల్లరి చేస్తావా! నన్ను అవమానిస్తావా?'' శ్రీరామమూర్తి కసికసిగా అంటున్నాడు. రాధ మాట్లాడలేదు. ఇంతలో ఇంటరవెల్ అయింది.

లైట్లు వెలిగింది: శ్రీరామమూర్తి ప్రక్కకు చూసాడు.



సుజాత తల వంచుకొంది. శ్రీరామ మూర్తి అదిరిపడ్డాడు. "సుజాత? రాధ ఎక్కడా? ఏమైంది! అసలు స్కూటర్ ఎక్కింది రాధా? సుజాతా?

"హలో! శ్రీరామ్!" అంటూ పలకరించాడు శేఖర్. వెనక రాధ వుంది.

"అరే! సుజాత!" అంటూ ఆశ్చర్యం నటించి దగ్గిరి కొచ్చిన రాధను చూచి —

"రాధా! బాగున్నావా?" అని పలకరించింది తనూ ఆశ్చర్యంగా సుజాత. శ్రీరామ చంద్రమూర్తికి దిక్కుతోచలేదు! నిజంగా వెర్రెటి మనిషే శేఖరం!

# ప్రయాణం

బి. విద్యాసాగర్




నేను విజయవాడలో బంధువుల యింట్లో పెళ్ళికి వెళ్ళి, హైదరాబాద్ తిరిగి రావడానికి రైలు కంటే, బస్సులో తొందరగా రావచ్చునని, ఆలోచించాను. నిజానికి నేను రైలు తిరుగు ప్రయాణానికి రిజర్వేషన్ చేయించుకోలేదు. ఆరోజు రాత్రి 9 గం. ప్రాంతంలో బస్సుకోసం యెదురు చూస్తున్నాను. ఇంతలో మా తాలూకా యం.యల్.ఏ.(శాసన సభ్యుడు) కనిపించాడు. ఆయనను చూసి –

"నమస్కారమండీ! ఏమిటి మీరుకూడా హైదరాబాద్ వస్తున్నారా!" అన్నాను వెంటనే.

"అవునండీ! నేను ఈ వూళ్ళో కొద్దిగా పని వుండి వచ్చాను మళ్ళీ అసెంబ్లీ సెషన్స్ దగ్గరకు వస్తున్నాయి కదా! అందుకని హైదరాబాద్ బయలుదేరాను."

"ఏమిటి! మీరు కూడా మాతోపాటు బస్సులో కానీ, రైలులో కానీ, ప్రయాణం చేయవలసినదేనా! హాయిగా కారులో వెళ్ల కూడదూ!" అన్నాను నవ్వుతూ.

"నాకు కారు యెక్కడనుంచి వస్తుంది నాయనా! నేను యేమయినా మంత్రి నయితే, అలాగే మీరు చెప్పినట్లు హాయిగా కారులో వెళ్ళేనాడిని! నాకు ఆ ఛాన్సు రాలేదు. పోనీ స్వంత కారు కొనుక్కోవడానికి నాకూ దానితో అవసరం లేదు. కొనుక్కునే ఆర్థికస్తోమత లేదు" అన్నాడు.

"అదేమిటండీ! మీరు కూడా మాలాంటి వుద్యోగస్థులలాగా మాట్లాడుతారు? మీకు యం. యల్. ఏ. గా ప్రభుత్వం కొంత యిస్తుంది; మీకు మనవూళ్ళో బాగా ఆస్తి పాస్తులు వున్నాయి" అన్నాను.

"ఆస్తి వుందని విలాసాలకి డబ్బు దుర్వినియోగం చేసుకుంటామా? ఏది అవసరమో, అదే కొనుక్కుంటాము. నా దృష్టిలో అనవసరం అనిపిస్తే, నయా పైసా ఖర్చు పెట్టను" అన్నాడాయన.

"మీరు హాయిగా యే మంత్రిగారు కారులోనయినా హైదరాబాద్ వెళ్ళక పోయారా!" అన్నాను.

"బాగుంది! మీరు చెప్పేది! ఎవరయినా మంత్రిగారు మన తాలూకాలో పర్యటనకు వస్తే, అప్పుడు ఆయన వెంట తిరిగితే బాగుంటుంది! అంతేకానీ, మిగతా సమయాలలో వాళ్ళ వెంట తిరగడం నాకు యిష్టం వుండదు."

"అహా! అదికాదు! యెవరయినా మినిష్టరు యిప్పుడు విజయవాడకు టూరులో వస్తే, ఆయనతో వెళ్ళితే మీరు హాయిగా వెళ్లవచ్చును. త్వరగా హైదరాబాద్ చేరుకోవచ్చును."

"ఇప్పుడు యే మంత్రి టూర్‌లో లేరు. అయినా వాళ్లతో వెళితే బాగుండదు! మంత్రిగారు కారుకి తగిన సిబ్బంది ఆయన వెంట యెప్పుడూ వుంటుంది" అన్నాడు ఆయన జోక్ చేస్తూ.

"అంటే పి.ఏ. బంధువులు, స్నేహితులు లాంటి వారా!" అన్నాను నేను కూడా నవ్వుతూ.

"కరెక్టు! కారుకు సరిపడ్డ జనం వుంటారు" అన్నాడు. ఇంతలో హైదరాబాద్ వెళ్ళే బస్సు వచ్చింది.

మేము యిద్దరం బస్సు యెక్కాము. మావూరి కబుర్లు, హైదరాబాద్ విశేషాలు, సినిమాలు, రాజకీయాలు గురించి కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేశాము. మా యిద్దరికీ పక్క పక్క సీట్లు దొరికాయి. అది మా అదృష్టం! బస్సుకు సరిపడా జనం యెక్కారు. బస్సు కదిలింది. జోరుగా పోతున్నది. రైలు అయితే, యే బెర్తు అయినా రిజర్వు చేసుకుని నిద్ర పోవచ్చును. బస్సులో అదేమీ కుదరదు కదా! తెల్లవార్లు జాగరణ చేయవలసినదే! ఆ రోజు శివరాత్రి అయినా బాగుండేది! జాగరణ చేసినందుకు

పుణ్యం వచ్చేది! కానీ ఆ రోజు అమావాస్య! మంచిరోజు చూసుకుని ప్రయాణం చేయడానికి ఆఫీసువాళ్ళు శలవు యివ్వరు కదా! అందువలన ఆ రోజు గత్యంతరంలేక తిరుగు ప్రయాణానికి పూనుకున్నాను. మర్నాడు నేను మా ఆఫీసులో డ్యూటీలో చేరాలి.

బస్సు యేదో వూళ్ళో ఆగింది. అక్కడ జనం బాగా బస్సు నిండా యెక్కారు. కండక్టర్ అందుకు అభ్యంతరం చెప్పలేదు. రాత్రిపూట వాళ్ళకు బస్సు యెక్కడ దొరుకుతుందని సానుభూతితో స్టాండింగ్ పాసింజర్సును యెక్కించుకున్నాడు. కానీ డ్రైవరుకు అది యిష్టంలేదు. అది రూల్సుకు వ్యతిరేకమని వాదిస్తాడు. బస్సు అరగంట పైగా ఆ వూళ్ళో డిటెయిన్ చేశారు. ఈ అరగంటలో నేను, యం. యల్. ఏ. గారు, కాఫీ త్రాగివచ్చి బస్సు యెక్కాము. మా సీట్లలో సూట్‌కేసు, హాండ్‌బాగ్ వున్నాయి. అదీకాక, కండక్టర్‌కు చెప్పాము కనుక, మా సీట్లు యెవరూ ఆక్రమించుకోలేదు. మేము వచ్చి సీట్లలో కూర్చోగానే, కండక్టర్‌తో "ఏమిటి ఆలస్యం! బస్సు యింకా బయలుదేరదేమిటి!" అన్నాను.

"ఏమి చేయమంటారు! ఇక్కడ బస్సు నిండా జనం యెక్కారు! అది డ్రయివర్‌కు యిష్టంలేదు. బస్సు పోనివ్వమంటే డ్రయివర్ ఇంజన్ స్టార్ట్ చేయడంలేదు!" అన్నాడు.

"అదేమిటి! అతని సంగతి యేమిటో నేను కనుక్కుంటాను వుండు" అంటూ యం.యల్.ఏ గారు రంగంలోకి దూకాడు.

ఆయన వెళ్ళి డ్రయివర్‌తో "ఏమిటయ్యా! బస్సులో స్టాండింగ్ పాసింజర్సు వున్నారు అని, బస్సును ఈ వూళ్ళో గంట సేపు లేటు చేస్తారా! అది తప్పు కదూ! మీ మూలంగా మాకు ఆలస్యం అయిపోవడం లేదా!" అన్నాడు కోపంగా.

"బస్సులో స్టాండింగ్ ప్యాసింజర్సును తీసుకోకూడదండీ డిస్ట్రిక్ట్ సర్వీసులో! అది మా రూల్సుకు వ్యతిరేకం!" అన్నాడు.

"రూల్సు సంగతి ఆలోచిస్తుంటే, ప్యాసింజరకు లేటు అయిపోవడం లేదా!" అన్నాను నేను.

"నాకూ, అతనికీ పడదండీ! మేము యిద్దరం చెరొక యూనియన్‌కి చెందిన వాళ్ళమండీ!" అన్నాడు అసలు రహస్యం బయట పెడుతూ డ్రయివర్.

"అదా సంగతి! మీరు ఇద్దరూ చెరొక యూనియన్ వాళ్ళని ప్యాసింజర్సును ఇబ్బంది పెడతారా!" అన్నాడు యం. యల్. ఏ.

"అది కాదండీ! ఓవర్ లోడింగ్ చేస్తే వచ్చే బస్సు డిపోలో మమ్మల్ని సంజాయిషీ అడుగుతారు. నాకు సంజాయిషీ చెప్పడం ఇష్టంలేదు. అదీగాక కండక్టర్ స్టాండింగ్ ప్యాసింజర్లు చాలామందికి టికెట్లు యివ్వకుండా డబ్బులు జేబులో వేసుకుంటాడు. ఇది మా ఆర్. టి. సి. రూల్సుకు వ్యతిరేకం! కార్పొరేషన్‌కు అన్యాయం చేయడం కాదా!" అన్నాడు డ్రయివర్.

వెంటనే యం. యల్. ఏ. కండక్టర్‌ని బస్సులో ప్రయాణీకులకు అందరికీ టికెట్లు యిచ్చాడో, లేదోనని ఆరాతీశాడు. కండక్టర్ "అందరికి టికెట్లు యిచ్చానండి! డ్రయివర్ చెప్పేదంతా పచ్చి అబద్ధం! కావాలంటే మీరు పాసింజర్సును కనుక్కోండి" అన్నాడు.

యం. యల్. ఏ. "ప్రయాణీకులు అందరికీ టికెట్లు యిచ్చాడా కండక్టర్" అని అరిచాడు. టికెట్లు ఇచ్చాడనేటప్పటికి, అప్పుడు డ్రయివర్ యిక గత్యంతరం లేక బస్సు స్టార్టుచేశాడు. మళ్ళీ బస్సు జోరుగా బయలుదేరి జగ్గయ్యపేటకు బయలుదేరింది. దారిలో మొత్తం మీద రెండు గంటల ఆలస్యం అయింది మా ప్రయాణం! జగ్గయ్యపేటలో యం యల్.ఏ గారు బస్సు దిగారు. డిపోఆఫీసులోకి వెళ్ళి "మీ డ్రయివర్, కండక్టర్ ప్రయాణీకులని యెక్కించుకోవడం విషయంలో పోట్లాడుకుని రెండు గంటలు ఆలస్యం చేశారు" అంటూ ఫిర్యాదు చేశాడు. "ఇది మా బస్సుల్లో మామూలే! ఓవర్ లోడింగ్ చేసినప్పుడు పేచీ వస్తుంటది. ముఖ్యంగా యిద్దరూ చెరొక యూనియన్‌కి చెందిన వాళ్ళు అయినప్పుడు" అని సమాధానం చెప్పాడు బస్సుడిపోలోవున్న అధికారి.

"ఇలాంటివి మీరు అరికట్టలేరా! వీళ్ళ పోట్లాట మూలంగా ప్రయాణీకులు ఇబ్బంది పడుతున్నారు. ప్రయాణంలో ఆలస్యం అవుతుంది" అన్నాడు యం. ఎల్. ఏ.. ఆయన డిపోలో కూర్చుని మాట్లాడుతూ వుండగా బస్సు కదిలింది. నేను డ్రయివర్‌తో చెప్పాను కాని అతను వినిపించుకోలేదు. బస్సు పోనిచ్చాడు. యం. యల్. ఏ. గారి సూట్‌కేసు నాదగ్గర వుండిపోయింది.



నవంబరు 14 వ తేదీ నాడు రాష్ట్రపతి "ఎవరు బాధ్యులు" అనే బాలల చిత్రాన్ని రాష్ట్రపతి భవనంలో చూచి విజయవాడకి చెందిన రచయిత, నిర్మాత అయిన రాజబాబును అభినందించారు.

డా॥ మహీధర్ నళినీమోహన్

# సైన్సులో సరదాలు

## కొవ్వొత్తి ఎందుకు ఆరిపోయింది ?

అడుగున ఒక అంగుళం వ్యాసమూ, పైన సుమారు ఒక పావు అంగుళం వ్యాసమూ గల శంఖు ఆకారపు (సీసా బిరడావంటిది) కర్రముక్క తీసుకో. సుమారు జానెడు పొడుగున్న రాగితీగను తీసుకుని ఆ కర్రముక్క చుట్టూ సర్పిల్ ఆకారంలో (స్పైరల్) చుట్టుకుంటూ వెళ్ళు. తరువాత కర్రముక్కనుంచి రాగితీగ సర్పిల్ విడదీసెయ్యాలి.





కొవ్వొత్తి వెలిగించి నేలమీద నిలబెట్టు. తీగ సర్పిల్‌ని బొమ్మలో చూపించినట్లు ఆ కొవ్వొత్తి మంటమీద పెట్టి ఉంచు. కొద్దిసేపట్లోనే కొవ్వొత్తి ఆరిపోతుంది !

మంటకి అవసరమైన గాలి పుష్కలంగా అందుతున్నా సరే, కొవ్వొత్తి ఎందుకు ఆరిపోయిందీ ?

కొవ్వొత్తి మండడంలో ఒకచమత్కారం ఉంది. అగ్గిపుల్ల గీసి కొవ్వొత్తిని వెలిగించిన తరువాత, మంటవేడికి కొవ్వు కరిగి, వత్తి గుండా పైకివచ్చి, వాయురూపం పొంది, అప్పుడు మండుతుంది.

రాగితీగ చక్కని ఉష్ణవాహకం కావడం చేత, మంటతాలూకు వేడినంతా పీల్చుకుని, కొవ్వుకరగడానికి అడ్డువస్తుంది. దానితో మంట ఆరిపోతుంది.




Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# నాన్నారి కారు నేనే రిపేర్ చేసేశా!



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే రీగల్ కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం అందుకు 'రీగల్' మాత్రమే సరయిన డిటర్జెంట్ సబ్బు. 'రీగల్'కుగల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి, మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల-శక్తివంతమైన-నురుగునిచ్చేది 'రీగల్' ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే 'రీగల్,' మీకు ఎంతో పొదుపు చేస్తుంది. 'రీగల్'ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.




Rediffusion D/768e/TL/R

# అభినందన గ్రీటింగ్ కార్డ్సు



ప్రతి సందర్భానికీ ఒక వర్ణ చిత్ర సందేశం!



న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్ వారి
శతచిత్ర అభినందనల 'హరివిల్లు'
అందరికీ పూలజల్లు.....

శ్రీ బాపు,
బాలి, చంద్ర ల చిత్రకల్పనకు
శ్రీ ఆరుద్ర, డా॥ సి. నారాయణరెడ్డి
కరుణశ్రీ ల
కమనీయ పద చిత్రాలు

15 రూపాయలు
M.O. చేయండి
12 కార్డులు గల
గిఫ్టు ప్యాక్
పొందండి




ALSO AVAILABLE WITH ENGLISH CAPTIONS

లభించు చోట్లు

బుక్ సెంటర్ మెయిన్ రోడ్... విశాఖపట్నం *
గుప్తా బ్రదర్స్ మెయిన్ రోడ్... విశాఖపట్నం *
బుక్ ట్రేడర్స్ కోటి... హైదరాబాద్ *

వివిధభారతి జనరంజని లో మా ప్రకటనలు వినండి!



## న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్

ఏలూరు రోడ్డు
విజయవాడ-2
ఫోన్:
62222